# ౧౯౧౯-౨౦ సంవత్సరమున ముద్రితములగు నూతనాంధ్ర గ్రంథములు

## 1. పద్యకావ్యములు—

అనంతగిరి విలాసము:— గ్రంథకర్త కే. ఓబరాజకవిగారు, తరిమెళ, అనంతపురముజిల్లా. వెల 0-12-0.

అన్నపూర్ణాపరిణయము:— శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రులుగారు ప్రణేతలు. రాజమండ్రి.

అభినవ సుమతిశతకము :— గ్రంథకర్త హెచ్. మహబూబుమియ్యాసుగారు. ప్రొద్దుటూరు. వెల 0-4-0.

ఆంధ్రకవిప్రశంస:— గ్రంథకర్త. నాదెళ్ల మేధాదక్షిణామూర్తిశాస్త్రిగారు. మచిలీపట్టణము. వెల 0-4-0.

ఈశ్వర స్తవము:— గ్రంథకర్త చింతలపల్లి నరసింహశాస్త్రిగారు. బళ్లారి. వెల 0-1-0.

ఒంగోలు మహామారి:— గ్రంథకర్త. పిశుపాటి చిదంబరశాస్త్రిగారు. కరవది, గుంటూరుజిల్లా. వెల 0-0-6.

కృతకసూత్రము:— గ్రంథకర్త. వేలూరి శివరామశాస్త్రిగారు, శతావధాని. చిరివాడ, కృష్ణాజిల్లా. వెల 0-12-0.

కుశలవ రామాయణము:— గ్రంథకర్త జి. అక్షయలింగంగారు. కాకినాడ.

చిత్రకేతు చరిత్రము:— గ్రంథకర్త. చింతపల్లి నరసింహశాస్త్రిగారు బళ్లారి. వెల 0-12-0.

చింతామణీ విలాసము:— గ్రంథకర్త. మలకపల్లి పెదశేషగిరిరావుగారు, కూరుపూరు, గోదావరిజిల్లా. వెల 1-0-0.

జనకస్మృతి:— గ్రంథకర్త. కే. రాఘవయ్యగారు. పెంటపాడు, కృష్ణాజిల్లా.

జాతీయకీర్తనలు:— గ్రంథకర్త. అయ్యంకి వెంకటరమణయ్యగారు. బెజవాడ.

జారవిచారము:— గ్రంథకర్త. కే. మృత్యుంజయవర్మగారు. కాకినాడ. వెల 0-0-6.

తిమ్మనాయనిచరిత్ర :— గ్రంథకర్త. ఆర్. దానంరాజు. వెల 1-0-0.

దశరత్నములు:— ప్రకాశకులు. ఏ. సత్యనారాయణమూర్తిగారు. విశాఖపట్టణము. వెల 0-1-0.

దశావతారములు:— ప్రకాశకులు. ఏ. సత్యనారాయణమూర్తిగారు. విశాఖపట్టణము వెల 0-1-0.

దాంపత్యధర్మబోధిని:— గ్రంథకర్త. మం. భుజంగరావుగారు ఏలూరు.

దీనకల్పద్రుమము:— గ్రంథకర్తలు. ప్రకాశకులు. దోమా వెంకటస్వామిగుప్తగారు, రామభజనసమాజ సభ్యులు. వెల 0-1-6.

ధర్మోపదేశము:— ప్రకాశకులు. పి. వి. నరసింహారావుగారు రాజమండ్రి.

శాపిత మదభంగము:— గ్రంథకర్త. ఏ. సూర్యనారాయణగారు. కాకినాడ. వెల 0-0-6.

నీతిమాలిక:— గ్రంథకర్త. ముడుంబి వెంకటరమణాచార్యులుగారు. ప్రకాశకులు. మై. హనుమంతరావుగారు. మద్రాసు.

నీతిపద్యరత్నావళి:— ఇది ఆంధ్రమునందలి భారత భాగవతములనుండి కూర్చిన పద్యరత్నములు గలది. ప్రకాశకులు. వి. తిరునారాయణమూర్తిగారు. బ్రాహ్మణకోడూరు, గుంటూరుజిల్లా.

పండుగకట్నము:— గ్రంథకర్త. ఖో. నారాయణమూర్తిగారు.

పూలమాల:— గ్రంథకర్త. ప్రకాశకులు. పి. వెంకటరావుగారు. పార్వతీపురము. వెల 0-2-0.

ప్రబంధకుసుమావళి:— ప్రకాశకులు. సి. వేంకటనరసింహారావుగారు. రాజమండ్రి. వెల 1-0-0.

ప్రభురత్నము:— ప్రకాశకులు కే. వెంకటసుబ్బారెడ్డిగారు. ప్రొద్దుటూరు.

భారతమాతృవిలాపము:— గ్రంథకర్త. జే. సీతారామస్వామిగారు. పిఠాపురము. వెల 0-2-0.

మల్లిక:— వరశుల్కములను నిరసించు గ్రంథము. గ్రంథకర్త. మోచెర్ల హనుమంతరావుగారు. కాకినాడ. వెల 0-2-0.

మహాలక్ష్మీపరిణయము:— గ్రంథకర్త. పి. వెంకటరమణయ్యగారు. ప్రకాశకులు. ఏ. సుందరరామయ్యగారు. కొమరిపాలెము గోదావరిజిల్లా.

మిత్రద్రోహము:— గ్రంథకర్త. బి. వేంకట్రావుగారు.

మీనాక్షీస్మృతి :— గ్రంథకర్త. వి. శ్రీరంగనాయకులు పంతులుగారు. గొడుగుపేట, బందరు.

ముక్తాలత:— గ్రంథకర్త. శతావధాని. వేలూరి శివరామశాస్త్రిగారు. చిరివాడ, కృష్ణాజిల్లా.

రాజశేఖరశతకము:— గ్రంథకర్త. టి. ఏకామ్రరావుగారు, సత్తెనపల్లి, గుంటూరుజిల్లా. వెల 0-3-0.

రుక్మిణీకళ్యాణము:— గ్రంథకర్త. ద్వి. నారాయణశాస్త్రిగారు. వెల 0-2-0.

వినాయక పంచరత్నములు:— గ్రంథకర్త. రామపిళ్లె బైరాగిగారు. బెజవాడ.

విదురుడు:— గ్రంథకర్త. సి. నరసింగరావుగారు. బళ్లారి. వెల 0-2-0.

వీరేశలింగవింశతి:— గ్రంథకర్త కాళ్లకూరి నారాయణరావుగారు. వెల 0-1-0.

శ్రీనాథుని లేఖలు:— గ్రంథకర్త. అధికారుల సూర్యనారాయణరావుగారు. పార్వతీపురము. వెల 0-2-0.

శ్రీహరిశతకము:— గ్రంథకర్త. కే. మృత్యుంజయవర్మగారు. కాకినాడ. 0-1-6.

సరోజిని, లేక కన్నీరుకథ:— గ్రంథకర్త. ఏ. వెంకటేశ్వర్లు గారు. నూతనభక్తిగ్రంథము. పార్వతీపురము. వెల 2-0-0.

సర్వేశ్వరశతకము:—యథా వాక్కుల అన్నమయ్యగారు. (పూర్వకవి) ప్రకాశకులు ఆంధ్రసాహిత్య పరిషదధిపతులు, మదరాసు, 0-3-0.

సీమంతినీ కల్యాణము:—గ్రంథకర్త పెనుమళ్ల సోమమంత్రి (పూర్వకవి) ప్రకాశకులు చెలికాని లచ్చారావుగారు, చిత్రాడ గోదావరి జిల్లా 0-14-0.

సీతాచరిత్రము:—ప్రకా. ఎస్. యస్. రాజు మద్రాసు.

సుందరరామచరితము:—గ్రంథకర్త పి. వి. వెంకటరమణయ్య గారు, పార్వతీపురము. వెల రూ 0-2-0.

సుకవిసూక్తి సుధాసారము:—ప్రకాశకులు తిక్కన పబ్లిషింగ్ కంపెనీవారు, నెల్లూరు 0-8-0.

సునీతిముక్తావళి:—గ్రంథకర్త వి. సుబ్రహ్మణ్యము గారు పార్వతీపురము 0-3-0.

సోప్రాబు:—గ్రంథకర్త మోచర్ల హనుమంతరావు గారు, కాకినాడ, 0-8-0.

చాడేశ్వరశతకము: గ్రంథకర్త కే. అచ్చయ్యగారు వేటపాలెము 0-4-0.

విజయనందన విలాసము: గ్రంథకర్త మంగళగిరి ఆనందకవి గారు ప్రకాశకులు సి. లచ్చారావుగారు చిత్రాడ 0-12-0.

పుణ్యపురుషస్తుతి: గ్రంథకర్త ఎమ్. బుచ్చికామకవి.

దీనావనశతకము: గ్రంథకర్త పి॥ బుచ్చిరాజుగారు కాకినాడ గ్రంథమునందు కరుణరసము చిప్పిలునట్టి పద్యములు పెక్కులుగలవు. వెల 0-2-6.

ప్రణయవిజయము: తిరుమలసెట్టి జగన్నాథకవిగారు వెంకటగిరి 0-12-0.

భువనమోహినీవిలాసము: గ్రంథకర్త ఆర్. కృష్ణమూర్తికవి గారు విజయనగరము 0-6-0.

చంద్రగిరిపాలశతకము: గ్రంథకర్త బి. కృష్ణశాస్త్రిగారు, ప్రకాశకులు జి॥ లక్ష్మినారాయణగారు జజ్జూరు.

కృష్ణశతకము: ప్రకాశకులు కే. లక్ష్మణమొదలిగారు మద్రాసు 0-1-0.

హితబోధిని: కే॥ నమశ్శివరావుగారు విశాఖపట్టణము.

భారతి: గ్రంథకర్త దీపాల పిచ్చయ్యశాస్త్రిగారు నెల్లూరు 0-10-0.

నలచరిత్ర: (ద్విపద) గ్రంథకర్త చక్రపురి రాఘవాచార్యులు గారు, ప్రకాశకులు బి. యతిరాజులునాయుడుగారు 0-2-0.

గోపాలనక్షత్రమాల: గ్రంథకర్త కే. శ్రీరాములుగారు ఈమని, గుంటూరుజిల్లా.

గోవిందకృష్ణ యాచేంద్రవిజయము: గ్రంథకర్త రత్నాకరము సుబ్బరాజకవిగారు, ప్రకాశకులు సి. సుందరరామశాస్త్రులు మద్రాసు.

వాల్మీకిచరిత్రము: చెలికాని లచ్చారావుగారు చిత్రాడ, గోదావరిజిల్లా 0-12-0.

సకలజనమనోభిరంజనము: గ్రంథకర్త ఎస్. వీరరాజకవిగారు ప్రకాశకులు కే. కృష్ణకుమార్ కాకినాడ 0-12-0.

## 2. గద్యగ్రంథములు—

ఉత్తరరామాయణసారము:—గ్రంథకర్త డి. సీతారామయ్యగారు. ప్రకాశకులు రామా కంపెనీవారు. ఏలూరు 0-8-0.

కంసనాశనము:—గ్రంథకర్త కే. వెంకటరమణయ్యగారు నెల్లూరు. 0-10-0.

కవిత్వతత్త్వము:—గ్రంథకర్త కే. కోదండరామయ్య గారు. బెజవాడ. ఆంధ్రమున కవిత్వము శైలి మున్నగు విషయములపై విమర్శనము ఇందు గలవు 0-8-0.

కుమారోపదేశము:—అనువాదకులు. సి. వెంకటనరసింహారావుగారు రాజమండ్రి. 0-12-0.

పద్మవ్యూహము:—గ్రంథకర్త డి. యస్. రామారావుగారు రాజమండ్రి.

పరశురామచరిత్రము:— ప్రకాశకులు రామా కంపెనీవారు. ఏలూరు. 0-10-0.

పరీక్షిజ్జననము:—గ్రంథకర్త. కే. వెంకటరావుగారు ప్రకాశకులు సి. అమ్మయ్యగారు, నెల్లూరు. 0-8-0.

ప్రచ్ఛన్నపాండవము:—గ్రంథకర్త. చిలకమర్తి లక్ష్మీనృసింహముగారు, రాజమండ్రి, 1-0-0.

బాలగుణితము:—ఎన్. చలపతిరావుగారు ఏలూరు. 0-3-0.

బాలరామాయణము:—ఏ. మాధవయ్యగారు. ప్రకాశకులు మాక్మిలన్ కంపెనీవారు. మద్రాసు.

భాసనాటక కథాసారము:—గ్రంథకర్త కపిస్థలము కృష్ణమాచార్యులుగారు. ప్రకాశకులు మాక్మిలన్ కంపెనీవారు, మద్రాసు రు. 0-6-0.

భాగవత కథాసారము. ప్రకాశకులు రామా కంపెనీవారు. ఏలూరు. రు 0-10-0.

భీష్మచరిత్ర:—గ్రంథకర్త బుక్కపట్టణము-రామానుజయ్య, 58 పేరంబాలుసెట్టివీథి, చాకలపేట. వెల రు. 0-14-0.

మధురలాలస:—గ్రంథకర్త. ఎస్. వి. రంగాచార్యులుగారు. మాంబళము, 0-12-0.

మహాభారతము:—(సభాపర్వము) గ్రంథకర్త, కలిదె వీరరాజుగారు (పూర్వకవి) ప్రకాశకులు స్టూడెంట్సు క్లబ్బువారు. అనంతపురము.

మీరాబాయి:—గ్రంథకర్త. ఎన్. చలపతిరావు గారు, ఏలూరు. 0-2-0

మహాభారత కథలు:—గ్రంథకర్త డి. సీతారామయ్య అ. 12.

విక్రమార్కుని కథలు:—గ్రంథకర్త. మహోపాధ్యాయ వేదము వేంకట్రాయశాస్త్రిగారు మద్రాసు. 0-14-0.

శబ్దోచ్చారణరత్నమాల:—పి. ఎస్. రామశర్మగారు 0-2-0

సిరియాళ చరిత్రము:—గ్రంథకర్త. కొత్తపల్లి సూర్యరావు గారు. ప్రకాశకులు వన్నయభట్టారక విలాసమువారు. చింతాద్రిపేట, మద్రాసు.

సీతాదేవి:—గ్రంథకర్త. ఎన్. చలపతిరావుగారు. 0-2-0.

సీతాదేవి:—గ్రంథకర్త ఎమ్. హనుమంతరావుగారు 0-1-0.

సీతారామము:—గ్రంథకర్త్రి. కలగర అన్నపూర్ణమ్మగారు వెల 1-0-0.

సోముఁడు:—గ్రంథకర్త. శతావధాని వేలూరు శివరామశాస్త్రిగారు. చిరివాడ కృష్ణాజిల్లా వెల 1-4-0.

హరిశ్చంద్రచరిత్రము:—గ్రంథకర్త. ఎన్. జలదుర్గాప్రసాదరావు గారు. రాజమండ్రి, 0-12-0.

ఆంధ్రవచనభారతము: గ్రంథకర్త పూర్వకవి యగు కలిదెవీరరాజు 0-8-0.

సావిత్రి: ఎన్. చలపతిరావుగారు ఏలూరు 0-2-0.

మొదటి హిందీవాచకమునకు తెలుగు అనువాదము: ప్రకాశకులు హిందీసాహిత్య సమ్మేళనమువారు, మద్రాసు.

జానార్థసంగ్రహము: వెల 0-1-6.

భీమ్మచరిత్ర: గ్రంథకర్త బి. రామానుజయ్యగారు 58, పేరంబాలుసెట్టివీధి, రాయపురం పోస్టు, మదరాసు 0-14-0.

ప్రహ్లాదచరిత్రము: గ్రంథకర్త జే. సీతారామస్వామిగారు పిఠాపురము 0-6-0.

3. చరిత్రగ్రంథములు—

కోశచరిత్రము:—గిడుగు వేంకటసీతాపతి గారు గ్రంథకర్త. ప్రకాశకులు వెంకటేశ్వర కంపెనీవారు మద్రాసు 0-8-0.

నానా రాజన్య చరిత్రము:—గ్రంథకర్త శ్రీరామ్ వీరబ్రహ్మము గారు. మచిలీపట్నము రు. 8-0-0.

మచిలీపట్టణము: గ్రంథకర్త ఎమ్. అప్పారావుగారు మచిలీపట్టణము.

4. వైద్యగ్రంథములు—

ఆరోగ్యవిషయములు:—గ్రంథకర్త. వై. యన్. హనుమంతరావు గారు ప్రకాశకులు ఏలూరు రామా అండు కంపెనీవారు. 0-2-0.

ఇక్ఫ్లుయెంజా:—గ్రంథకర్త. బి. శ్యామసుందరరావుగారు బరంపురము, 0-8-0.

కొన్ని ప్రశస్తయోగములు: గ్రంథకర్త ఆచంట లక్ష్మీపతి గారు మద్రాసు 0-4-0.

ఆరోగ్యసర్వస్వము: గ్రంథకర్త వి. వాసుదేవశాస్త్రిగారు కాకినాడ 0-6-0.

శ్రీబాలవైద్యసుధాబ్ధి: గ్రంథకర్త జి. వెంకటసుబ్బయ్యరాయగుప్తగారు గుంటూరు 2-8-0.

ధ్వనంతరి:—మల్లంపల్లి భైరవమూర్తిగారు, బందరు 4-8-0.

5. రాజకీయములు—

ఇండియా ప్రభుత్వపుబిల్లు:—ప్రకాశకులు పి. ఆర్. పార్థసారథి అయ్యంగారు చిత్తూరు.

హైందవ స్వరాజ్యము:—జి. హరిసర్వోత్తమరావు గారు. అనువాదకులు 1-0-0.

6. కళాగ్రంథములు—

మనశ్శక్తి:—గ్రంథకర్త ఎమ్. వి. మూర్తిరాజు గారు. కొలకలూరు తెనాలి తా॥ 1-0-0.

సంగీతగానమనోహరి:—గ్రంథకర్త్రి. వీణ అమ్మణ్ణిగారు. ప్రకాశకులు ఎస్. ఆళవందారు నాయుఁడు, మద్రాసు.

7. వేదాంతగ్రంథములు.

ఆత్మానాత్మవివేకము:— గ్రంథకర్త కే. పట్టాభిరామశర్మ గారు, కోవూరు, నెల్లూరుజిల్లా వెల 0-2-0.

ఆంధ్ర వేదాంతాద్వైతసిద్ధాన్త చింతామణి:— గ్రంథకర్త వఝ్ఝల నారాయణశాస్త్రి ప్రకాశకులు. ఏ. వి. జగ్గారావు గారు, విశాఖపట్టణము వెల 0-12-0.

తత్త్వానుసంధానము:— అనువాదకులు డి. ఆదినారాయణరెడ్డి మున్నగువారు, మరువాడ, నార్తార్కాడుజిల్లా వెల 4-0-0.

విశిష్టాద్వైత సంగ్రహము:—వావిలాల వేంకటశివావధానులు గారు, గ్రంథకర్త, బందరు వెల 0-6-0.

ఈశ్వరప్రమాణములు, బ్రాహ్మసిద్ధాంతములు: ప్రకాశకులు ఆంధ్రబ్రాహ్మమండలివారు కాకినాడ 0-3-0.

న్యాయదర్శనపరిచయము: ఆర్య. నారాయణమూర్తి గారు హిందూపూరు.

8. జీవితచరిత్రలు.

ఆడిదమునూరకవి:—గ్రంథకర్త ఆడిదము రామారావుగారు విజయనగరమునందలి ఆంధ్రపారిజాత గ్రంథమాలికలోని తొలికుసుమము వెల రు 1-4-0.

కబీరదాసు చరిత్రము:— గ్రంథకర్త శిరిపి ఆంజనేయులు గారు వెల 0-8-0.

గంధిమహాత్ముఁడు:—గ్రంథకర్త పి. నరసింహముగారు విజయనగరము వెల 0-1-0.

వన్నమ్మ జీవితచరిత్రము:—గ్రంథకర్త రెవరెండు క్రాటు దొరగారు, మద్రాసు.

సిద్ధార్థచరిత్రము:—గ్రంథకర్త చిలకమర్తి లక్ష్మీనరసింహముగారు, రాజమహేంద్రవరము వెల 0-12-0.

రాతు జగన్నాథరాయుని జీవితము: గ్రంథకర్త సూరిదాసకవి తిరుపతి, వెల లేదు.

## 9. కల్పనాగ్రంథములు.

అపూర్వప్రతిభ:— కే. ఆర్. కృష్ణారావుగారు గ్రంథకర్తలు. ప్రకాశకులు సి. లచ్చారావుగారు, చిత్రాడ వెల 0-12-0.

ఆంధ్రరాజులకథలు:— గ్రంథకర్త టి. కేశవరావుగారు. ప్రకాశకులు ఆంధ్రవాణీ గ్రంథమాలా సంపాదకులు, ఇనగల్లు, గుంటూరుజిల్లా వెల 0-2-0.

ఇచ్ఛినీకుమారి:—గ్రంథకర్త కేతవరపు వేంకటశాస్త్రిగారు, వెల 1-8-0.

కథాగీతములు:—చెల్ల పాపయ్యగారు వెల 0-4-0.

కరికృష్ణస్తోత్రము:—పి. యతిరాజముగారు, మద్రాసు.

క్రీస్తమకుపూలదండ:— కే. రాజరత్నముగారు వరహాపురము వెల 0-2-0.

గోదావరి:— గ్రంథకర్త యాతగిరి లక్ష్మీకాంతరావుగారు, ప్రకాశకులు వి. ఆర్. జగపతివర్మగారు, పెద్దాపురము.

జయచంద్ర విజయము:— గ్రంథకర్త ఎస్. వెంకటనరసింహారావుగారు, భీమవరము. 1-8-0

త్రిలింగ చిన్నకథలు:—గ్రంథకర్త అక్కిరాజు ఉమాకాంతముగారు, ప్రకాశకులు ఆంధ్రవాఙ్మయసమితివారు గుత్తికొండ, పిడుగురాళ్లపోస్టు.

దుర్బుద్ధి:—గ్రంథకర్త ఎమ్. రాఘవాచార్యులుగారు, ప్రకాశకులు రామాకంపెనీవారు ఏలూరు.

ధీరవల్లి:—గ్రంథకర్త కే. వెంకట్రావుగారు కాకినాడ 0-1-0.

పల్నాటివీరుల కథలు:—గ్రంథకర్త అక్కిరాజు ఉమాకాంతముగారు 0-8-0.

పిచ్చివానికథ:— ఎమ్. హనుమంతరావుగారు గ్రంథకర్త కాకినాడ 0-0-6.

మదనకామరాజు చరిత్రము:— ప్రకాశకులు, ఎ. బాలకృష్ణనాయకరు, మద్రాసు.

మనోహర విజయము:—ఎస్. వాసుదేవరావుగారు 0-12-0.

మయసభ:—గ్రంథకర్త పిల్లలమర్రి గోపాలకృష్ణయ్యగారు ప్రకాశకులు చెలికాని లచ్చారావుగారు, చిత్రాడ 0-10-0.

ముక్తాంబ:—పిల్లలమర్రి గోపాలకృష్ణయ్యగారు, ప్రకాశకులు వి. రామకోటీశ్వరరావుగారు కూచిపూడి, గుంటూరుజిల్లా.

యుగంధరవిజయము:—గ్రంథకర్త దొడ్ల వెంకటరామరెడ్డిగారు. ప్రకాశకులు ఏమ్. ఆర్. కృష్ణాకంపెనీవారు నెల్లూరు 2-4-0.

రాజరత్నము:—గ్రంథకర్త చిలకమర్తి లక్ష్మీనరసింహముపంతులుగారు, రాజమండ్రి 0-12-0.

రుద్రమదేవి:— గ్రంథకర్త సీతారామచంద్రరాయశాస్త్రిగారు (ఒద్దిరాజు)

రేచుక్క పగటిచుక్క కథలు:— ప్రకాశకులు కుప్పుసామి మొదలి మద్రాసు 0-1-0.

లోకతంత్రము:—ఎన్. చలపతిరావుగారు ఏలూరు 0-12-0.

వచనకళాపూర్ణోదయము:— ప్రకాశకులు సి. వెంకటనరసింహరావుగారు రాజమండ్రి, వెల. రు 1-8 0

శశికళ:—గ్రంథకర్త కే. రంగయ్యగారు, నరసాపూరు 0-4-0.

శుకసప్తతికథలు:—ప్రకాశకులు టి. బాలకృష్ణనాయకరు, మద్రాసు 0-4-0.

విధిలేని దత్తత: గ్రంథకర్త డి. అప్పయ్యశాస్త్రిగారు గుంటూరు 0-1-0.

విద్యుత్ప్రభ: గ్రంథకర్త భాగవతుల చెన్నకృష్ణమ్మగారు గుంటూరు 1-0-0.

బాలవినోదకథలు: గ్రంథకర్త ఎన్. చలపతిరావుగారు ఏలూరు.

గిరిబాల: గ్రంథకర్త రాళ్లపల్లి గోపాలకృష్ణశర్మగారు, ప్రకాశకులు సి. శ్రీనివాసరావుగారు అనంతపూరు 0-8-0.

అశోకుఁడు: గ్రంథకర్త కే. యల్. యన్. సోమయాజులు రాజమండ్రి 0-12-0.

ఎడమకాలితన్ను కుడిచెంపముద్దు, ఇతడునామగడు, అతఁడు నాకూతురిమగడు: గ్రంథకర్త ఏ. సుందరరామయ్య కొమరిపాలెము 0-4-6

## 10 నాటకములు.

ఆంధ్రమాళవికాగ్నిమిత్రము:— గ్రంథకర్తలు మహోపాధ్యాయ వేదము వేంకటరాయశాస్త్రిగారు మద్రాసు 0-12-0.

ఆంధ్రీకృతాభిజ్ఞానశాకుంతలము:— గ్రంథకర్త మంత్రిప్రెగడ భుజంగరావుగారు, ఏలూరు 0-12-0.

చారిత్రనాటకపంచకము:—గ్రంథకర్త వి. వేంకటలక్ష్మీనరసింహముగారు, కాకినాడ 0-10-0.

చింతామణిమాలామహానాటకము:—గ్రంథకర్త కజ్జల నారాయణశాస్త్రిగారు, ప్రకాశకులు వి. వి. సత్యేశశర్మగారు శ్రీకాకుళము 0-12-0.

చిరకారినాటకము:—ప్రకాశకులు వి. కృష్ణమాచార్యులు కంపెనీవారు, బళ్లారి. 1-0-0.

తపతీసంవరణము;— అనువాదకులు కాశర్ల కొండలరాయుడుగారు, కొవ్వూరు, కృష్ణాజిల్లా 0-12-0.

నందిపాటిమిత్రవిందాపరిణయము:— గ్రంథకర్త్రి యన్. శేషాంబగారు, ప్రకాశకులు ఏ. పి. కవి. అనంతపూరు 0-8-0.

పద్మవ్యూహము:— గ్రంథకర్త రాళ్లబూరి నారాయణరావుగారు 1-0-0.

పాదుకాపట్టాభిషేకము:-- టి. యస్. రామస్వామి అయ్యంగారు శిష్పము, సార్తారాక్కాడుజిల్లా.

పౌరాణికకథానాటకములు:-- ఏ. వి. నరసింహముపంతులు గారు, ప్రకాశకులు ఆర్. వెంకటాచలము కంపెనీ ట్రిప్లికేన్, మద్రాసు 0-4-0.

ప్రతిజ్ఞావిజయరామరాజీయము:--గ్రంథకర్త భాగవతుల నర సింహశర్మగారు బరంపురము.

ప్రచ్ఛన్నపాండవము:--గ్రంథకర్త గాడిచెర్ల హరిసర్వోత్తమ రావుగారు మద్రాసు 0-12-0.

భర్తృహరిప్రబోధము: - అనువాదకులు దాసరి లక్ష్మణ స్వామిగారు పిఠాపురము 0-12-0.

మదనసాయకము:-- గ్రంథకర్త ఎల్లాప్రగడ జగన్నాథము పంతులుగారు బరంపురము.

మనోహరము:--గ్రంథకర్త తల్లాప్రగడ వెంకటసుబ్బారావు గారు శనివారపుపేట, ఉచితము.

రఘుకౌత్సీయము:--గ్రంథకర్త టి. యస్. రామస్వామి అయ్యంగారు శిష్పము, సార్తారాక్కాడుజిల్లా. 0-2-0.

వసంతకోకిల:--గ్రంథకర్త ఏ. ఆంజనేయశాస్త్రిగారు. ప్రకాశకులు టి. నరసింగరావుగారు బందరు 1-0-0.

వీరసంయుక్త:-- గ్రంథకర్త మోచెర్ల హనుమంతరావుగారు, కాకినాడ 1-0-0.

శ్రీకృష్ణతులాభారము:--గ్రంథకర్త బి. సీతారామరావుగారు బందరు 0-12-0.

సత్యవతీవిలాసము:--గ్రంథకర్త ఎల్. వెంకటరమణకవిగారు ప్రకాశకులు బి. త్యాగరాయశాస్త్రిగారు మద్రాసు. 0-4-0.

సావిత్రీనాటకము:--గ్రంథకర్త పి. గోపాలకృష్ణయ్యగారు రాజమండ్రి.

సావిత్రినాటకము:-- గ్రంథకర్త డి. సీతారామరావుగారు బందరు 0-12-0.

సుగ్రీవపట్టాభిషేకము:-- గ్రంథకర్త కస్తూరి సుబ్బారావు గారు అనంతపురము.

హరిశ్చంద్రనాటకము:-- రావుబహద్దరు ధర్మవరం కృష్ణమాచార్యులు గారు మద్రాసు. 0-8-0.

హిందూకథానాటకము: గ్రంథకర్త ఏ.వి. నరసింహము పంతులుగారు ప్రకాశకులు ఆర్. వెంకటాచలము కంపెనీవారు 0-4-0.

బ్రాహ్మణపల్లె చంద్రహాసనాటకము: గ్రంథకర్త కే. సింగయ్యగారు, ప్రకాశకులు ఏ. పి. కవి అనంతపురము వెల 0-8-0.

లంకాదహనము: గ్రంథకర్త డి. సీతారామరావుగారు, ప్రకాశకులు కే. సుబ్బారావుగారు భీమడోలు వెల 0-8-0.

ప్రతిజ్ఞాపాండవము: గ్రంథకర్త ఏ. సుందరరామయ్యగారు, ప్రకాశకులు యస్. వి బి. నారాయణరావుగారు కొవ్వూరిపాలెము 0-10-0.

సత్యభామామనోల్లాస నాటకము: గ్రంథకర్త ఎల్. తాతాచార్యులుగారు నరసారావుపేట.

వీరసేనవిజయము: గ్రంథకర్త ఏ. వెంకటహనుమంతరావు గారు పడమారు గోదావరిజిల్లా 0-10-0.

అకటవికటనాటకము: గ్రంథకర్త ఎస్. సుబ్రహ్మణ్యశాస్త్రి గారు గుంటూరు 0-4-0

## 11. మత గ్రంథములు

అనార్యమతఖండనము:---గ్రంథకర్త దుర్భాక సీతారామ శాస్త్రులుగారు బుక్కపట్నము.

అనుభవశతకము:-- నల్లా దినకోటయ్యగారు. పాలకొల్లు. కృష్ణాజిల్లా 0-1-0.

ఆంజనేయదండకము:--ప్రకాశకులు వావిళ్లవారు మద్రాసు. వెల 0-2-0.

అంతరంగిక జీవితము:--ఇది ఇమిటేషను ఆఫ్ క్రీస్తు అను దాని కనువాదము. అనువాదకులు నిడమర్తి వెంకటనరసింహారావు భీమవరము 0-12-0.

ఆత్మానంద బోధానందశతకము:--గ్రంథకర్త బి. వెంకటాచలశర్మగారు. కోసరారిపల్లె, చిత్తూరుజిల్లా.

ఆదిత్యహృదయము:-- ప్రకాశకులు. వి. సూర్యనారాయణ గారు, ఏలూరు 0-1-0.

ఆరాధనక్రమము:--గ్రంథకర్త. రచయింపు పి. బి. ఎమ్మెటు గారు. కర్నూలు

ఆర్యానంద సంకీర్తనలు:--ప్రకాశకులు. వి. సుబ్బయ్యగారు. ఏలూరు 0-4-0.

ఆలూరు రంగనాయక మాహాత్మ్యము:--గ్రంథకర్త. బి. వెంకటాచార్యులుగారు 0-8-0.

ఈశ్వరతారావళి:-- గ్రంథకర్త, జే. సీతారామస్వామిగారు. పిఠాపురము.

ఈశ్వరీశతకము:--సెనగల హనుమయ్యగారు పొలపర్తి. గుంటూరుజిల్లా 0-2-0.

కపోతేశ్వరశతకము:-- గ్రంథకర్త, ఏ. సీతారామస్వామి గారు, పిఠాపురము

కీర్తనలు:--అద్దంకి దావీదుగారు, గ్రంథకర్త సికిందరాబాదు (దక్కను) 0-1-6.

కృష్ణదండకము:--కే. యస్. రాఘవాచార్యులు కడప.

కృష్ణస్తోత్రము:--వెంకటాచార్యులుగారు ఏలూరు.

కోటీశ్వరస్వామిదండకము:--గ్రంథకర్త, పాపరాజు వెంకట కృష్ణయ్యశర్మగారు. నరసారావుపేట 0-1-0.

క్రీస్తుమతసుభూషదండ:--గ్రంథకర్త. కే. రాజరత్నముగారు. శరహోపురము. గుంటూరుజిల్లా 0-2-0.

క్రైస్తవమతోపదేశము:--ప్రకాశకులు, క్రిశ్చియన్ లిటరరీ అసోసియేషనువారు మద్రాసు 0-1-0.

గణపతి:--సత్యసుబ్రహ్మణ్యకవులు 0-0-6.

జగన్నాయికాస్తవము:--గ్రంథకర్త. ఎస్. పేరరాజుగారు. చగలూరు. కర్నూలుజిల్లా 0-1-0.

జ్ఞానాంబాదండకము:--గ్రంథకర్త కే. సుదర్శనదాసు గారు వెల 0-0-6.

తిరుమంత్రార్థసారసంగ్రహము:--గ్రంథకర్త బి. రాఘవదాసుగారు వెల 0-1-0.

తెలుగు కీర్తనలు:-- గ్రంథకర్త శివరంగు భాగవతుగారు మెదకు, నైజాముయిలాకా.

దీనసంరక్షణశతకము:-- గ్రంథకర్త మోచెర్ల హనుమంతరావుగారు కాకినాడ 0-4-0.

ధన్వంతరి దండకము:--గ్రంథకర్త చివుకుల సత్యనారాయణశాస్త్రి వెల 0-1-0.

నాగబ్రహ్మశతకము:--శంకరరెడ్డిగారు 0-4-0.

నారసింహ నక్షత్రమాల:--గ్రంథకర్త బి. సత్యనారాయణమూర్తిగారు బెజవాడ 0-0-6.

నిజలింగచిక్కయ్య చరిత్రము:--గ్రంథకర్త ఎస్. పెద్దరంగయ్యగారు కర్నూలు.

పంచముఖలింగశతకము:-- గ్రంథకర్త ఏ. పాపారావుగారు పినతాడివాడ, విశాఖపట్నంజిల్లా 0-1-0.

పరమపదవిలాసము:-- గ్రంథకర్త ఎమ్. వెంకట్రాయప్ప బసవింగుపేట 1-0-0.

ప్రత్యక్షీకరణము:--ద్వితీయకాండము.

పానకాలు నృసింహస్మరణము:-- ఎమ్. ముత్యముగారు మంగళగిరి 0-1-0.

పానకాలస్వామిస్తోత్రము:--పి. సుబ్బరావు తెనాలి 0-1-0.

పార్థసారథిశతకము:-- ఎస్. రామస్వామికవిగారు విజయనగరము 0-2-0.

పెరుంబూదూరు మాహాత్మ్యము:- 0-2-0.

భక్తకల్పద్రుమశతకము:--బి. అమరయ్యశాస్త్రిగారు బయ్యవరము, గుంటూరుజిల్లా 0-2-0.

భక్తజనమనోరంజనము:--గ్రంథకర్త నాసరి లక్ష్మణస్వామిగారు, పిఠాపురము 0-4-0.

భక్తిశతకము:-- సి. వెంకటసుబ్బయ్యగారు, విశాఖపట్టణము వెల 0-4-0.

భక్తిజ్ఞానకీర్తనలు:-- గ్రంథకర్త పి. నాగలింగాచారి గారు, ప్రకాశకులు ఓంపెద్ద నాగయ్యకంపెనీవారు రాజమండ్రి 0-2-0.

భగవద్గీతార్థమంజరి: - గ్రంథకర్త కొల్లూరి పట్టాభిరామయ్యగారు 0-2-0.

భగవదనుమతము:--డి. సూరయ్య, చల్లపల్లి.

భజనకీర్తనలు:--గ్రంథకర్త బి. నరసింహదాసుగారు, ప్రకాశకులు పి. రంగనాయకులుగారు తిరుపతి 0-1-6.

భద్రకాళీశతకము:- గ్రంథకర్త జి. రామభద్రరాజుగారు, ప్రకాశకులు జి. సూరపరాజుగారు బరగపూడి, గోదావరిజిల్లా 0-2-0.

భద్రాచలాధీశ్వరశతకము:--గ్రంథకర్త్రి మోదవరపు లక్ష్మీనరసమాంబగారు 0-2-0.

మతశిఖ:-- ప్రభాకర ఉమామహేశ్వరశాస్త్రిగారు గ్రంథకర్త, నరసారావుపేట 0-4-0.

మల్లేశ్వరకీర్తనలు:--గ్రంథకర్త జి. వెంకటసుబ్బరాయగుప్తగారు.

మహాశక్తిస్తోత్రము:-- ఐ. నరసింహస్వామిగారు తోటేము, కృష్ణాజిల్లా 0-1-0.

మహోన్నతసేవ:--ప్రకాశకులు క్రిశ్చియను లిటరరీ అసోసియేషన్‌వారు మద్రాసు వెల 0-1-0.

మానసశతకము:--బి. సీతారామరాజకవిగారు పులపల్లి, గోదావరిజిల్లా 0-1-0.

మీరాబాయిచరిత్రము:--కే. సంజీవమూర్తిరావుగారు బళ్లారి వెల 0-1-0.

ముకుందశతకము:-- గ్రంథకర్త పి. శ్రీనివాసరావుగారు ఏలూరు 0-2-0.

ముక్తికాంత ఎటుక:-- ప్రకాశకులు రామయ్య అండు సన్సు కాకినాడ.

మోక్షకాంతచిద్విలాసము:-- గ్రంథకర్త కే. కాశయ్యదాసుగారు 0-4-0.

మోక్షమార్గ ప్రదీపిక:--పి. త్యాగరాయశెట్టిగారు మద్రాసు.

మోక్షమార్గ నిజస్వరూపసుబోధ:--గ్రంథకర్త. కే. బంగారయ్యగారు 0-4-0

రంగనాథ సంకీర్తనలు. ఐ. సుబ్బారెడ్డిగారు పొందుటూరు కృష్ణాజిల్లా

రాజయోగసారము... ప్రకా. పి. త్యాగరాయ శెట్టి గారు మద్రాసు.

రామచంద్రశతకము:... నారాయణ పిళ్లె గారు, చిత్తూరు.

రామశతకము:... గ్రంథకర్త. టి. సీతారామచౌదరి గారు కావూరు, గుంటూరు జిల్లా.

రామేశ్వరభజనలు:... గ్రంథకర్త్రి. కే. వెంకటరంగనాయకమ్మగారు బెజవాడ. వెల 0-6-0.

విద్యుత్స్మాలి:... గ్రంథకర్త, హైదరుబహదుర్ఖాన్. ప్రకాశక. వి. రామదాసు పంతులుగారు. విశాఖపట్టణము వెల 0-4-0.

విష్ణుపురాణకథాసారము...ప్రకాశకులు. జి. లక్ష్మణశాస్త్రిగారు బెజవాడ.

వీరాంజనేయతారావళి...ప్రకా. పి. శేషయ్యగారు నరసారావుపేట.

వెంకటకృష్ణభారతము:—(హరికథ) గ్రంథకర్త. పాపరాజు వెంకటకృష్ణయ్యగారు నరసారావుపేట. వెల 0-1-0.

వెంకటాచలరమణశతకము:— గ్రంథకర్త. పి. శ్రీరాములు నాయుడుగారు బందరు.

వెంకటేశ్వరమేలుకొలుపులు:— గ్రంథకర్త. కే. చెంగయ్య దాసుగారు. 0-1-6.

వేదవాక్యపాఠములు:— గ్రంథకర్త. గ్లాటనుగారు. 0-10-0.

వేదాంతరత్నాకరము.— గ్రంథకర్త కే. వీరభద్రయ్యగారు గుంటూరు. వెల 0-2-0.

శివశతకము:... వి. వెంకటకవిగారు కాకినాడ.

శివతారకావళి:— గ్రంథకర్త. బంకపల్లి వెంకటనృసింహ సిద్ధాంతి శ్రీకాకుళము.

శ్రీరామశతకము:— గ్రంథకర్త. రాధామాధవరావు గారు కాకినాడ. వెల 0-2-0.

శ్రీహరిశతకము:—సి. వెంకట్రామాచార్యులు గారు ఏలూరు, వెల 0-4-0.

శుద్ధనిర్గుణతత్త్వములు:— గ్రంథకర్త్రి. సేలనూతుల వెంకట సుబ్బమ్మగారు. ప్రకాశకులు. రామా కంపెనీవారు ఏలూరు.

షట్స్థలగురుబోధసారము:—గ్రంథకర్త్రి చాగంటి వీరమాంబగారు రాజమండ్రి. 0-8-0.

సంగమేశ్వరశతకము:—గ్రంథకర్త. డి. భవానీసింగు గారు కంబంమెట్టు.

సిద్ధాసిద్ధాంతపద్ధతి:— ప్రకాశకులు కంచెర్ల సత్తిరాజుగారు కాకినాడ. వెల 0-1-6.

హనుమజ్జీవితము:— ఎస్. వెంకటసుబ్రమణ్యశాస్త్రి గారు గ్రంథకర్తలు. గుంటూరు. 0 12-0.

అధ్యాత్మరామాయణకీర్తనలు: ప్రకాశకులు కే. అప్పయ్య రాజమండ్రి.

మతపాఠములు: ప్రకాశకులు క్రిశ్చియను లిటరేచరుసొసైటీ వారు మద్రాసు.

సత్యరత్నము: గ్రంథకర్త కే. ధాళిపాటిశర్మగారు కొట్నూరు, అనంతపురము.

ఉడిపిక్షేత్రమహిమ: గ్రంథకర్త పి. గుండురావు గారు ఉడిపి 0-8-0.

అద్వైత బ్రహ్మేశ్వరీ తారావళి: బి. కోదండపాణిగారు ప్రకాశకులు జి. యస్. ఏ. నారాయణహరిరావుగారు చెరుకుపల్లి గుంటూరుజిల్లా 0-2-0.

రామతారావళి: ప్రకాశకులు బి. రోసిరెడ్డిగారు కంకల గుంట, నరసారావుపేట తాలూకా.

క్రైస్తవజీవ్యపునియమములు: జి. జి. లారీగారు బెంగుళూరు 0-0-6.

తత్త్వరహస్యములు: గ్రంథకర్త వాగభూషణముగారు ప్రకాశకులు పి. త్యాగరామశ్రేష్ఠిగారు మద్రాసు, 0-1-0.

భ్రామరి: గ్రంథకర్త ఎమ్. నాగవీరేశ్వరశాస్త్రిగారు సికందరాబాదు (దక్కను) 0-4-0.

ప్రాటెస్టెంటుమతఖండనము: గ్రంథకర్త పాస్కు-వాలీగారు ఏలూరు 0-9-9.

క్రొత్తపరిశుద్ధ వృత్తాంతము: ప్రకాశకులు పి. బుచ్చిరామయ్య గారు బెజవాడ.

సింహగిరిశశశతకము:— వరద గిరి నారాయణశర్మగారు.

తిరుపతి వెంకటేశ్వర కర్ణామృతము: గ్రంథకర్త యస్. సూరిదాసకవి తిరుపతి 0-4-0.

ఆర్తరక్షామణి: సన్నవరపు సూర్యనారాయణమూర్తి గారు బరంపురము 0-4-0.

వెంకటేశ్వర కీర్తనలు: జి. తిమ్మాదాసు గారు, ప్రకాశకులు పి. త్యాగరాజుశెట్టిగారు మద్రాసు.

లక్ష్మీ చెన్నకేశవశతకము: పోకా వెంకటకృష్ణదాసుగారు, ప్రకాశకులు బి. వెంకటప్పయ్య బెజవాడ 0-4-0.

త్రిపురసుందరీశతకము: గ్రంథకర్త కే. వెంకట్రామయ్యగారు కాకినాడ 0-4-0.

అమ్మవారిదండకము: ప్రకాశకులు ఏ. సన్యాసినాయుడు గారు బెజవాడ 0-1-0

ఎడ్లరామదాసుచరిత్ర: ప్రకాశకులు బి. యతిరాజులునాయుడుగారు మద్రాసు 0-4-0.

సూర్యనారాయణాష్టోత్తరశతము: వి. వెంకయ్యదాసుగారు రాజమండ్రి.

## 12. ఇతరగ్రంథములు.

అంటరానివాళ్లా!— ప్రకాశకులు శ్రీకృష్ణాశ్రమము వారు వేదపాఠము. వెల 0-2-0.

అబ్బికోట:— గ్రంథకర్త. యాతగిరి లక్ష్మీనరసింహా రావు గారు ప్రకా. జగపతివర్మగారు పెద్దాపురము. వెల 0-4-0.

ఆంజనేయరగడలు:— ప్రకా. జి. పాపయ్య గారు ముత్యాలమ్మపేట.

ఉపన్యాసమాలిక:—గ్రంథకర్త. కే. చినరఘుపతిరావు,పిఠాపురము.

ఊర్మిళనిద్ర:— ప్రకాశకులు. ఏ. సూర్యనారాయణమూర్తి గారు విశాఖపట్టణము.

ఏకశిలానగరద్వయవివాదసంగ్రహము:—గ్రంథకర్త. శ్రీకాకొలను సుబ్బారావుగారు మదరాసు.

ఒరంగలు ఒంటిమిట్ట వివాదము:— గ్రంథకర్త. పొద్దుటూర్ల వీరయ్యపంతులుగారు బెజవాడ.

కన్యకాంబాచరిత్రము:—గ్రంథకర్త. నారాయణభాగవతులుగారు. ప్రకాశకులు చెదలువాడ సుందరరామ శాస్త్రులుగారు.

కమ్మకులాభ్యుదయము:... ఎస్. వెంకటకవి గారు ఏలూరు. వెల 0-8-0.

కలియుగచర్య:... గ్రంథకర్త. ఏ. వెంకటరత్నము గారు. పిఠాపురము. వెల 0-4-0.

కాంభోజరాజు:...ప్రకా. కుప్పుమొదలిగారు మదరాసు.

కైకేయీప్రబోధము:... గ్రంథ. నారాయణ భాగవతులు. ప్రకా. సి. సుందరరామశాస్త్రిగారు మద్రాసు. వెల 0-2-0.

గయోపాఖ్యానము:...(పదము) గ్రంథకర్త. పి. రామబ్రహ్మముగారు. ప్రకా. ఏ. సత్యనారాయణమూర్తి గారు, విశాఖపట్టణము. వెల 0-1-6.

గీతావళి:...ప్రకాశకులు. బి. నరసింహారావుగారు చిత్తూరు.

గోషావ్యాసఖండనము:... కే. వి. కృష్ణారావుగారు గంపలగూడెము కుమారరాజాగారు.

గ్రంథాలయోద్యమము:...గ్రంథకర్త. యాతగిరిలక్ష్మీరమణ

గారు కాకినాడ. వెల 0-2-0.

చవితిచందురునికథ:... గ్రంథకర్త. పొడుగురామబ్రహ్మము గారు విశాఖపట్టణము.

జాతీయవస్త్రధారణము:—గ్రంథకర్త. కే. సుబ్బారాయులు గారు అనంతపురము. వెల 0-2-0

డింజాఫార్సు:— కే. యల్. యన్. సోమయాజులు రాజమండ్రి.

తిరుపతివేంకటేశ్వర్ల సాక్ష్యము:— ప్రకాశకులు. ఎ. సత్యనారాయణగారు, విశాఖపట్టణము.

దయగలయోగి:—ప్రకాశకులు. పి నంజుండప్పగారు పారిగె అనంతపూరుజిల్లా.

నారాయణప్రశ్నరత్నమాల:... ప్ర. కా. టి. పురుషోత్తము గారు బెజవాడ. వెల 0-2-0.

నిరుద్యోగులఫార్సు:...గ్రంథకర్త. కే. యల్. యన్. సోమయాజులుగారు రాజమండ్రి. వెల 0-4-0.

నౌకాచరిత్రము:... ప్రకాశకులు దువ్వూరి జగన్నాథశర్మ గారు కాకినాడ. వెల 0-2 6.

పాటలు:...జే. రామలక్ష్మమ్మ. బందరు. వెల 0-4-0.

పాటలు;...గ్రంథకర్త. సెనగల హనుమయ్యగారు వడ్లమూడి గుంటూరు. వెల 0-4-0.

ఫార్సీపాటలు...ప్ర. కా. వి కుప్పుమొదలి. మద్రాసు.0-4-0.

పెండ్లిపాటలు,...ఎన్ వెంకటరామకవి ఎనుగుపాల గుంటూరు జిల్లా.

పొడుపుగీతములు ...ఎన్ చలపతిరావు ఏలూరు.

ప్రస్తుతపాఠశాలలు,...రామకోటిశాస్త్రి. గుంటూరు.

ప్రొద్దుపొడుపుపువ్వులు,...ప్ర. కా. ఓలేటి పార్వతీశముగారు. పిఠాపురము వెల 0-12-0.

ప్రహ్లాదచరిత్ర,...ప్ర. కా. ఎ. సత్యనారాయణగారు విశాఖపట్టణము.

బమ్మెరపోతరాజవిజయము: ప్రకాశకులు పోతరాజసమాజమువారు కడప వెల 0-12-0.

బాతాఖానీ: బి. సుబ్బారావు 0-4-0.

బాలకృష్ణలీలలు: ప్రకాశకులు ఏ. సత్యనారాయణగారు విశాఖపట్టణము 0-0-2.

బాలభటునికవాతు: అష్టావధానము గ్రంథకర్త అయ్యంకి వెంకటరమణయ్యగారు బెజవాడ.

బాలభటపటాలమును కూర్చుట ఎట్లు: గ్రంథకర్త అయ్యంకి వెంకటరమణయ్యగారు బెజవాడ.

బాలభటులమై యుండు టెందులకు? : గ్రంథకర్త అయ్యంకి వెంకటరమణయ్యగారు బెజవాడ.

భూస్వర్గలడ్డు: ప్రకాశకులు అభినవ కవిసమాజమువారు కొంగనపాడు, కర్నూలుజిల్లా.

మల్లమ్మదేవిచరిత్రము ప్రకాశకులు కే. కాళయ్యశెట్టిగారు వెంకటగిరి 0-8-0.

మహాత్మదీక్షువిలాసము: గ్రంథకర్త ఎమ్. వెంకటపతిదాసు గారు ప్రకాశకులు కే. కాళయ్యశెట్టిగారు.

మూర్ఖవాదఖండనము: మృత్యుంజయరావుగారు గుడివాడ 0-4-0.

మైరావణచరిత్రము: ప్రకాశకులు వి. కుప్పుమొదలిగారు.

రామాయణబోధితప్రభావధర్మములు: గ్రంథకర్త సి. కుంటిర రామశాస్త్రులుగారు మద్రాసు 0-4-0.

రామకథామృతము: గ్రంథకర్త కారుపల్లి శివరామదాసు గారు బెంగుళూరు 0 1-0.

రామకథాసంగ్రహము: పొడుగు రామబ్రహ్మము గారు విశాఖపట్టణము 0-0-8.

రుక్మాంగదచరిత్రము: ప్రకాశకులు ఎస్. వెంకటరామయ్య గారు నిడదవోలు.

లంకాయాగము: గ్రంథకర్త రఘుపతికవిగారు ప్రకాశకులు వి కుప్పుమొదలి మద్రాసు.

లంకణాలబోటు: గ్రంథకర్త ఎమ్. రాఘవాచార్యులుగారు ఏలూరు 0-1-0.

లక్ష్మణమూర్ఛ: గ్రంథకర్త పి. బుచ్చన్నపంతులుగారు ప్రకాశకులు ఏ॥ సత్యనారాయణగారు విశాఖపట్టణము 0-0-9.

వివిధదంపతీవిలాసము: ప్రకాశకులు పి లక్ష్మయ్యగారు కర్నూలు 0-4-0.

వృద్ధవరప్రహసనము: గ్రంథకర్త నూరి సుందరరామశాస్త్రి గారు బెజవాడ.

వేగుజుక్కకథలు: 5, 6 7, 8, 10 నంబర్ల సంచికలు ఒక్కొక్కటి 0-8-0. ప్రకాశకులు వేగుజుక్కకథావళీమండలివారు బరంపురము.

సంగీతసత్యవ్రత హరిశ్చంద్ర: గ్రంథకర్త్రి పింగళి అనంతమ్మ గారు హనుమకొండ 0-3-0.

సత్యవ్రతలక్షణము: ప్రకాశకులు ఎన్. ఆనందరావుగారు ఏలూరు.

సీసపంచరత్నములు: వి. ఎఱుకయ్యగారు పెరుకలపూడి, గుంటూరుజిల్లా.

హరిశ్చంద్రోపాఖ్యానము: గ్రంథకర్త వి. అప్పలదాసు పార్వతీపురము 0-8-0.

వ్యవసాయమార్గబోధిని: పి. అప్పారావుగారు తిరుపతి 0-2-0.

జాతిపుక్కశాస్త్రము: గ్రంథకర్త ఈ. భాగవతయ్యగారు విశాఖపట్టణము 0-4-.

దేసింగురాజుకథ: ప్రకాశకులు బి. యతిరాజులుశెట్టిగారు మద్రాసు 0-1-6.

రాద్ధాంతపంచాంగము: గ్రంథకర్త కే. వి. కృష్ణారావుగారు విజయనగరము 0-1-6.

నందనందనచరిత్రము: గ్రంథకర్త బి. కృష్ణశాస్త్రిగారు, ప్రకాశకులు జి. లక్ష్మీనారాయణరావుగారు జుజ్జూరు, నందిగామ తాలూకా.

ఘోషా: గ్రంథకర్త సి. లచ్చారావుగారు చిత్రాడ, గోదావరిజిల్లా 0-8-0.

హితుడు: గ్రంథకర్త ఎన్. నరసింహమునాయుడుగారు గుంటూరు.

పద్మావతీవర్ణనము: జి. రామకృష్ణశాస్త్రిగారు, నూచర్లపల్లె.

మద్యపానము: గ్రంథకర్త మల్యాల సాంబశివరావుగారు ప్రకాశకులు బి. రామానుజశర్మ చిత్రాడ.

అభ్యుదయము: గ్రంథకర్త కే. శివరామదాసుగారు బెంగళూరుసిటి 0-1-0.

విజయము: ప్రకాశకులు క్రిశ్చియను లిటరేచరు సొసైటీ వారు మద్రాసు.

# సుకృతి ప్రశస్తి

## * జ్యోతిషరత్నాకర సిద్ధాంతి శివశంకరశాస్త్రులు గారు

శివముగ శంకరుఁ డా రా
ఘవుఁ డా వాల్మీకికృతిని తమ చెలికొలిపెన్
శివశంకరుండు శ్రీ యాం
ధ్రవాల్మీకిప్రోక్తకృతికిఁ బ్రాముఖ్య మిడున్.

క. కవి సాష్టాంగనమస్కృతి
సవినయత సమర్పిత మని సత్కృతి నిడుటన్
చవిగొనక యుండఁ దగ దని
సవివేకత నాదుకొంటి సద్వినయముతోన్.

క. పుట్టిరి కవు లెందఱో, మఱి
గిట్టిరి కావ్యంబు లెన్ని గిట్టెం బుట్టెన్
ఇట్టిపరిస్థితి నేఁ గవి
భట్టారకుఁ డనుచుఁ గాదు భావింపంగన్.

క. అయిన న్నా యాశయమున్
నయోక్తులం దెల్పువాఁడ నార్యవర్యుల్
దయచే మదుక్తిభావము
స్వయంమతిప్రభ నెఱింగి స్వస్తి వచింపన్.

క. సద్యః పరనిర్వృతికై
నూద్యము మొదవుటయ విజ్ఞసూచక మందున్
హృద్యకృతిరూప మగుట య
విద్యావిచ్ఛేద మనుట విదితార్థం బౌ.

క. ఎటు లన శ్రుతిసారం బని
పటుమతు లరసిరి సదర్థ పరిణతిచే సం
స్ఫుటజగదాకృతి నొక్కటి
పటుతమతారకము రామపద మని కాదే.

క. ఆ దివ్య రామనామమె
భేదాభేదప్రపంచ భిన్నార్థంబున్
మేదిని దనరూపున నుప
పాదించెం ద్రివిధజన్మపరతత్త్వముచే.

క. సకలపురాణంబులలో
నకళంకము రామచరిత మని వినుతింపన్,
ప్రకటప్రభావమహితున్
సుకవీంద్రుఁడు పుట్టఁబట్టి సుయశం బందెన్.

క. ఆ వాల్మీకిమునీంద్రుఁడె
భూవినుతుం డయ్యె భవ్యభూతిం గనుటన్
భావింప నతఁ డెఱిఁగె మా
యావల్మీకమున వెడలి యాత్మానందున్.

క. అమ్ముని వచోగభీరత
నిమ్ముగ మది నెఱుఁగ నేర కెందఱో విజ్ఞుల్
సమ్ముదమునఁ బారాయణ
సమ్మతిఁ గడదేలుచుండ్రు సతతము ధాత్రిన్.

క. అట్టి మహాకావ్యంబుం
గట్టిగ సరికట్టఁ బూని కవి సాహసి యై
తుట్టతుదవఱకుఁ దీర్చెడు
పట్టు గదా! యిట్టి గట్టిపట్టే పట్టు.

క. వ్యక్తీకరించె నిర్మల
భక్తిప్రాభవమొ! పూర్వభవపుణ్యంబో!!
సూక్తిక్రియామనస్క
ప్రోక్తం బెద్దియను భువినిఁ బూర్ణత నందన్.

క. ఏవంవిధకావ్యంబుం
గావింపన్ సాంతముగను కర్త యొకం డౌ
భావింపఁగ నని యడిగెద
రా వావిలికొలను సుబ్బరాయుండె యగున్.

క. అంతటి సుకృతం బబ్బుట
వింత యనం దగదు చూడ విధివిహితం బౌ
శాంతరసైకనిధాన
స్వాంతుం డై యొప్పు నతఁడు సత్కవి గానన్.

క. బిరుదుగ వెలసెన్ సత్కవి
యురుముదమున నాంధ్రవాల్మీకాఖ్యుఁడౌ
ధరణి నితం డని మెచ్చుట
వరయంగా నింతకన్న నధికుఁడు కలఁడే.

క. ఇక్కవి గద ధన్యుం డన
నొక్కఁడె విలసిల్లుచుండు నూర్జితయశుఁడై
తక్కంగలాంధ్రు లెందఱో
గ్రక్కున సామాన్యు లైరి ప్రాముఖ్యు ల్గారే.

---

* వీరు మద్రాసు ప్రెసిడెన్సీకళాశాలలోఁ గర్ణాటక పండితులుగ నున్న యాంధ్రులు. భాషాత్రయకవిత్వశోభితు లఁట. వీరి యాంధ్ర కవితాశైలి తెలియుటకై ఆంధ్రవాల్మీకిరామాయణముపై ఇచ్చిన పద్యాత్మక మగు అభిప్రాయపత్రమునుండి కొన్ని పద్యములు ఇందు ప్రకటితములు — సంపాదకుఁడు.

క. సౌమ్యకృతి నెంద ఱతికై
వమ్యయతిం గ్రామ్యకృతిగఁ జాటఁగ నేమా
రమ్యాని దోషాకరుఁ డన
రమ్యత కే హాని గాని రాఁగలదె కవన్.

క. ప్రాజ్ఞంమన్యు ల్గొందఱు
స్వజ్ఞానవశంబు జగము సర్వ మనుచు న
ల్పజ్ఞతఁ దమలో నెంచక
సుజ్ఞకృతిం దెగడి తెగడి సొంపఱుతు రొగిన్.

క. లక్షణ మలక్షణం బను
పక్షమె భగవత్కథాద్యపద్యంబులలో
లక్షించము కా దనుచు స్వా
పేక్ష న్భక్తులను దూఱు విజ్ఞులె యజ్ఞుల్.

క. తన యాళ్వారులు మును పెయు
పనిషత్సారంబు నింపి పాశురము లనం
గనకపుఁగుంభము లిడి భువి
జనసామాన్యం బటంచుఁ జాటించిరటుల్.

క. గాయత్ర్యాదికమహిమ క
పాయము రాకుండ నదియు పరిణామం బై
యీ యాంధ్రమునం బుండఁగ
వ్రాయంగా నెవనితరము ప్రాజ్ఞుఁ డికండా.

క. దుష్ప్రజ్ఞాభావతయున్
నిష్ప్రత్యూహోత్తకార్యనిర్వాహతయున్
దుష్ప్రభుసేవాభావ మ
దుష్ప్రాప్యముఖ్యము నిరస్తదురితఫలంబుల్.

క. ఇన్నిఁటి నందిన సత్కృతి
కన్న స్మృతియొఁకడు కలఁడె ఘనుఁ డీయిలలో
నన్ని యటులుండ నిందు ప
రోన్నతి ననసూయుఁ డగుట నభినుతగుణుఁడౌ.

క. సాజము గానా విష్ణుని
తే జానకభూ ప్రభుత నుతిం గనఁ గలతే
రాజవరేణ్యుఁడు రాముఁడె
రాజిల్లెం బీఠికాపురప్రభువరుఁ డై.

క. మధురపూర్ణాశ్రయునిన్
సద్గుణవంతున్ సుగుప్తసద్దానపరున్
తద్గుణతే కాకృప్త సు
హృద్గణిసై యిట్లు చెప్పి హృష్టుఁడ నగుదున్.

క. *పుట్టగ వచ్చిన గుణములు
కట్టెలతో గాని పోవు కలుషాత్మునకున్
గట్టిగఁ జెప్పిన బుద్ధులు
పట్టునె మనమునకు నిలుకఁబడు నేతిరమై? (ఆం.వా.రా.అర.౧౩౬)

క. ఇ ప్పద్యప్రకరణమున
నొప్పుగ నర్థంబుఁ బూని యూహించినచో
దప్పని నేఁ జెప్పను మఱి
తప్పకఁ దా నిట్లు చేయఁ దగు నని తోఁచున్.

క ఎవని కెది దృఢగుణం బగు
వివర్జితం బగుట యద్ది వివశం బయినన్
జెవిఁ గొను కుమతుల యింట
న్నివసింపదు ధర్మ మచలని ర్వైకదవా.

క. దోషమొ? ఇది బుధులకు, మఱి
దోషాభాసంబా? చూచి తోఁచినభంగిన్
దూషించిన భూషించిన
దూషణభూషణలు లేవు దుష్టాత్మునకున్.

క. భూసురుఁడవు వానుకవీ
భాసిల్లగ భాసురమతి వ్యాసోక్తులకున్
న్యాసెద వీఁక నీ సుకృతము
భాసరోయఁగడు వాని కెక్కి భాసిల్లు నిలన్.

క. పుణ్యం బగు నీకం దని
గణ్యం బగు నీతఁ డనియుఁ గవితాసన్నై
పుణ్యం దని ధన్యం దని
గణ్యగుణుం డనియు ధాత్రిఁ గంటివి ఖ్యాతిన్.

క. కవి యాయుస్సుఖవృద్ధులఁ
బ్రవిమలహనాదికావ్యప్రాముఖ్యమునన్
అవిరళకీర్తినిఁ దన ద్విజ
సువిధా నాశీస్సు నాదు సూక్తి ఘటింతున్.

క. ఆనందరామసత్కృతి
నానందించితిని మఱియు నాంధ్రుఁడ నగుటన్
ఆనందము నాంధ్రమునం
దానీతసుధోక్తులందు నందితిని గడున్.

క. భాషాత్రయకవితావా
గ్యోషాపాదారవిందయుగళీధూళీ
భూషానిరస్తదోషము
నీషాశ్యత నిచ్చి ప్రోచు నల్ భారతియే.

క. శివుఁడు వరదుండు శంభుఁడు
కవిగమ్యుఁడు కతుఁడు శాస్త్రకరుఁడు నరయ శ్రీ
స్తవరహితుఁ డాత్మసిద్ధాం
తవిహితకృత్యుఁ డని పల్కు ధృతి రఘువరుఁడే.

* 'కామం స్వభావో యో యస్య న శక్యః పరిమార్జితుం, న హి దుష్టాత్మనా మార్య మావస త్యాలయే చిరమ్.' (వా. మూలము)

# కౌమారభృత్యము

ఆయుర్వేదవిశారద, చావలి రామమూర్తిశాస్త్రి గారు

కుమారుల రక్షణ మనునది యాయుర్వేదాష్టాంగములలో నొక ముఖ్యమయినది. శిశువులకు వలయు గినదివాభివృద్ధియు సంభవించెడు వ్యాధుల చికిత్సయు, నీభాగమున విపులముగా విమర్శింపఁబడినవి. ఈభాగము కేవలము మన యాయుర్వేదముననే కాక ఆంగ్ల యూనాని వైద్యకము లందును విమర్శింపఁబడినవి. కాని ప్రకృతము మనదేశమున కాయుర్వేదీయ పద్ధతులంతటి యుపకారకము లితరములు గావని యెల్ల రెఱింగిన విషయ మగుటను ఈ పద్ధతులు మన దేశమున విశేషవ్యాప్తిలో లేనందువను జనసామాన్యము చాలఁ గష్టములకు లోనగుచున్నది. కావున నీవిషయమును గొంచెము వివరింపఁ బూనితిని.

శిశువు జనించినతోడనే సైంధవ లవణముఁ గలిపిన తేనె నేయి శరీరమునకుఁ బూసి శరీరము నావరించియుండు మావిని తీసివేయవలయును. అనంతరము ప్రసవమువలనఁ గలిగిన ఆయాసముపోవుటకై బలాతైలము మున్నగు తైలములచేఁ జక్కఁగ శరీరమును తడుపవలెను. సైంధవలవణము కలిపిన తేనె నేయిని వ్రేలితో శిశువునోటియందు రాయుటవలన కఫము మున్నగుదోషములు హరించును. నేతితో గర్పూరమును గలిపి దానిని శిరముపైని ప్రత్తిపింజతో వేయవలయును. పిదప నాభినాళమును నాలుగంగుళములకు పై నొకదారము గట్టి యక్కడ ఛేదించి యా నాళశకలములోఁ గూడిన సూత్రమును శిశువు మెడలో గట్టవలయును. ఛేదించిన నాళమును చెంగల్వకోష్టుచే కాచిన తైలముతో లేపనము చేయవలయును.

తరువాత పాలుగలచెట్ల ఆకులు మొదలగునవి వేసి కాఁచినవియును, సుగంధద్రవ్యములచే కాఁచినవియును బంగారు, వెండి, మొదలగు లోహములు వేసి కాఁచినవియు నగు నీళ్లతో గాని గోరువెచ్చని నీళ్లతో గాని శిశువులకు ఆకాలములయందుండు దోషములకుఁ దగినట్లు వెలఁగయాకు మొదలగువానిని వేసి కాఁచిన జలములోఁ గాని స్నానమును చేయింపవలయును.

## స్తన్యపానక్రమము.

శిశువునకు మొదటి దినమున నల్లసుగంధిపాల చూర్ణము తేనె నేయి వీనిని గలిపి మూఁడుసారులు నాకింపవలయును. రెండుమూఁడు దినములందు లక్ష్మణ యను మూలికతోఁ దయారుచేసి నేతిని త్రాగింపవలయును. మూఁడవదినమునఁ గాని నాలవ దినమునఁగాని తల్లికి స్తన్యము ఆవిర్భవించును. అప్పటినుండియుఁ దల్లిపాలు పిల్లల కాహారముగా నుపయోగింపవలయును. మొట్టమొదటినాఁడు చేఁపినపాలను మొదటఁ గొన్నిధారలను పైన పిండివేయవలయును. అట్లు చేయకున్న బిడ్డకుఁ బ్రమాదము వాటిల్లును. తల్లిపాల నిచ్చుటయే పిల్లలు క్రమక్రమాభివృద్ధి నొందుటకు ముఖ్యకారణము, ఒకవేళ తల్లిపాలు లేని యెడలఁ బిల్లయందు మిక్కిలి ప్రేమగలదియును, సమానజాతి గలిగియును యోగ్యురాలును రోగములేనిదియు లేనిదియును వ్యసనము లేనియు లేనిదియును జీవద్వత్సయును సమృద్ధిగాఁ బాలు గలదియును నగు స్త్రీని శిశువునకుఁ బాలిచ్చుటకై నియమించినయెడల ఆశిశువునకు సదా ఆరోగ్యము మంచి బలమును గలుగును. శిశువులకు శుద్ధమయిన స్తన్యము నుపయోగింపవలయును. శుద్ధస్తన్యలక్షణము వాగ్భటమున నిట్లు వివరింపఁబడినది. పాలను నీటిలో వైచినతోడనే భేదములేకుండ నీటిలోఁ గలసిపోయినయెడల నవి శుద్ధ మగు పాలు. వాతదూషిత మగు పాలు నీటిలో వేసినతోడనే నీటిపైని దేలుటయు, నురుగు గట్టుటయు మొదలగు గుణము లగపడును. ఆపాలను సేవించినచో మలమూత్రబంధము గలుగును. పైత్యదూషిత మగు స్తన్యము నీటి మీఁద వేసినతోడనే పచ్చని రంగుగీత లగపడును. వానిని సేవించిన సర్వాంగతాపము గలుగును. కఫదూషితస్తన్యము నీఁటిమీఁద వేసినతోడనే నురువు గట్టినీటిలో మునిఁగిపోవును వాని నుపయోగించిన నగ్నిమాంద్యము గలుగును.

వీనిలో రెండేసి దోషము లున్నయెడల ద్వంద్వజము లనియు మూఁడు దోషము లున్నయెడల సాన్నిపాతికదూషితము లనియు నెఱింగి శుద్ధ మగు స్తన్యమునే బిడ్డల కుపయోగింపఁదగును. ఒకవేళఁ బైని చెప్పిన లక్షణములు గల యుపమాత (పాలతల్లి) లభింపనియెడల మేకపా లిచ్చుట యుత్తమము. అవియు దుర్లభము లయినచో నావుపాలను మేకపాలతో సమానగుణము గలవానిగాఁ జేసి యుపయోగింపవలెయును. వాగ్భటాచార్యుఁడు "ఆవుపాలలో ముయ్యాకుపొన్న కోలపొన్న వాఁకుడు నేలములఁగ పల్లేరు వీని వేళ్లుగాని, ముయ్యాకుపొన్న కోలపొన్నల వేళ్లను మాత్రమే గాని వేసి కాఁచి కొంచెము చక్కెరఁ గలిపినచో నవి మేకపాలయందు లాఘవాదిసుగుణములు గలవి యగు"నని చెప్పియున్నాఁడు. బిడ్డ కాఱుమాసములు గడచువఱకును పా లిచ్చువారు గాని పోయువారు గాని మిగుల వివేకముతో మెలంగవలయును. తెలివిలేమిని బిడ్డ యేడ్చినపు డెల్లఁ బాల నిచ్చినచో నజీర్ణము గలుగును. ప్రస్తుతము మనదేశమునందలి శిశుమరణముల కిది యొక హేతు వనుట నిస్సంశయము. కావున నదివఱకు త్రాగించిన పాలు బాగుగ జీర్ణించిన వని తెలిసికొని తిరిగి పాలిచ్చుచుండవలయును. ఆఱు మాసములకు లోఁబడిన శిశువునకు క్షీరాదుఁ డనియును (పాలుమాత్ర మాహారముగాఁ గలవాఁడు) ఆటుతరువాత క్షీరాన్నాదుఁ డనియు సంజ్ఞలు గలవు. ఆఱు మాసములు గడచిన

పిదప శిశువునకు మామూలురీతి పాలను లఘువును బృంహణమును నగు నన్నమును గూడ నీయవచ్చును. దంతములు మొలచిన పిదప శిశువునకు క్రమముగాఁ దల్లిపాలు మానిపింపవలయును. మానిపించుటలో మిక్కిలి లఘువును బుష్టికరమును నగు నన్నమును నుపయోగించుచుండవలయును. శిశువునకు దంతము లంకురించినపిదప (1) సారపప్పు, అతిమధురము, తేనె, పేలపిండి, కలకండ, వీనిని జక్కఁగఁ గలిపి ఆవిరిపై నుడికించి యుండ్రముగాఁ జేసి యిచ్చిన మంచి పుష్టి కలుగును. (2) మారేడుపిందెలు, ఏలకులు, పేలపిండి, చక్కెర, వీనిని ఆవిరిచే నుడికించి యుండ్రముగా నుపయోగించిన జఠరాగ్ని చక్కఁగ వృద్ధి యగును. (3) ఆరెపువ్వు, చక్కెర, పేలపిండి, మఱియును తృప్తికరములు బలకరములు నగు నితరవస్తువులను జేర్చి పైరీతి నుండ్రములు చేసి యిచ్చినచో నజీర్ణవిరేచనములు మొదలగువాని నాపి శిశువున కారోగ్యము నిచ్చును. శిశువునకు పదునెనిమిది మాసములు గడచినపిదప స్తన్యమును క్రమక్రమముగా నాపివేయవలెను. కొందఱు పాలుగల తల్లులు తమబిడ్డలకు అయిదాఱేండ్లు వచ్చువఱకును స్తన్యము నిచ్చుచుండుట నక్కడక్కడ కలదఁట. అది పిల్లలకుఁ జాల బుద్ధిమాంద్యమును గలుగఁజేయును. కావున ఈ దురభ్యాసమును మానవలెను. ఆవయస్సు చిన్నపిల్లలు చాపల్యమున నేవేని యనర్థము లగు పనులు చేయుటయు వారి నితరులు భయపెట్టుటయుఁ గలదు. అట్లు భయపడిన శిశువునకు బాలగ్రహాదివ్యాధు లతిసులభముల సంభవించును. కావున నట్టిసందర్భములనుండి శిశువులను గాపాడుకొనవలయును. మఱియుఁ బిల్లలనుముఱికిబట్టలనుండియు, చెడుగాలినుండియు గృశింపఁజేయు నాహారవిహారములనుండియు రక్షింపవలయును. సంతతము బిడ్డల నెత్తికొని నలిపివేయరాదు. ఈవిషయములను చక్కఁగ గమనింపనియెడల గొప్ప అనర్థము వాటిల్లును. ఈ విషయమున వాగ్భటాచార్యులు 'వస్త్రవాతాత్కరస్పర్శాత్పాలయేల్లంఘితాచ్చ తమ్' అని తెలిపియున్నాఁడు. ఈవయసు కలుగు బాలురకు బ్రాహ్మ్యాదిఘృతమును వచాదిఘృతమును ఇచ్చిన జాలలాభము గలుగును. బ్రాహ్మ్యాదిఘృతము:—మండూకబ్రాహ్మి తెల్ల ఆవాలు వసకొమ్ము నల్లసుగంధిపాల చెంగల్వకోష్టు సైంధవలవణము పిప్పళ్లు వీనిని సమభాగములుగా తూచుకొని అందు నీళ్లు పోసి స్వరసమును దీసి దానికి నాల్గవభాగము నేతిని కలపి యథావిధిగ నేయి మిగులునట్లు కాచుకొనవలయును. దీని నుపయోగించినచో బిడ్డలకు వాక్పటుత్వము బుద్ధిపాటవము జ్ఞాపకశక్తి ఆయుర్వృద్ధి గలుగును. మఱియును పిల్లలకు పీడపోవుట గ్రహబాధ ఉన్మాదము మున్నగునవి నశించును.

వచాదిఘృతము.—వస తిప్పతీగ కచ్చోరములు కరకకాయలు తెల్లదంతెన వాయువిడంగములు సొంటి ఉత్తరేణి వీనిని సమభాగములుగా గ్రహించి కల్కము చేసి ఆవునేతిలోఁ జేర్చి విధిప్రకారము పాకము జేసి యిచ్చిన శిశువునకు బలము బుద్ధి జ్ఞాపకశక్తి ఆయుర్వృద్ధి వాక్పటుత్వమును గలుగును. ఇట్టిసులభములు నుత్తమములు నగు ఔషధము లెన్నియో యాయుర్వేదమునఁ జెప్పఁబడి యుండినను తెలియక పోవుటచేత బిడ్డలను పాడుచేసికొనుచున్నారు. విజ్ఞు లికనైనను శిశురక్షణమున బద్ధాదరు లగుదురు గాక యని ప్రార్థించెదను.

# మధురకవిత

## అ. రామలింగస్వామిగారు

మలయ నగమునందుఁ బుట్టి మందమంద గతుల మెట్టి
వాసనతో నాసలతో వరలు చుండెదన్.

లతికల నుయ్యాల లూఁగి యతిమధురరసంబుఁ ద్రాగి
కేళితోడ, హాళితోడఁ గిరలు చుండెదన్.

సెలయేటను స్నానమాడి యళుల పాట హాయిఁ గూడి
చలువడితోఁ గలరుతితో నలరు చుండెదన్.

గాలి పడగగములఁ దేల్చి ఘనతరుసుమచయములఁ దాల్చి
వేడుకతోఁ బోడిమితోఁ గ్రీడఁ జేసెదన్.

ఘన మహీజములను మీటి వనధుల నవలీల దాఁటి
బలముతోడఁ జలముతోడఁ జెలఁగు చుండెదన్.

జిలిబిలి చెమరించు బాలికల కపోలములను సోలి
త్రాఁచు నోటఁ దగిలియోటఁ దరలి పోయెదన్.

ఏమి జన్మ మేమి చేవ? ఏల బ్రతుక యారె! జీవ సౌఖ్య మింత * జరుగుచుండ నమసి పోయినన్.

మూడవ రేకు—మొదటి ప్రక్క.

మూడవ రేకు—రెండవ ప్రక్కను.

మొదటి ప్రక్కను.

శ్రీస్వస్తి సర్వర్త్తు సుఖరమణీయా ద్విజయ కళిఙ్గ నగరా త్సకల భువన నిర్మ్మాణైక
సూత్రధారస్య భగవతో గోకర్ణ్ణస్వామిన శ్చరణకమలయుగల ప్రణామా దపగత
కలికలఙ్కో వినయనయ సమ్పదా మాధారః స్వాసిధారా పరిస్పన్దాధిగ
తసకల కలిఙ్గాధిరాజ్య శ్చతు రుదధితరఙ్గ మేఖలావనితల ప్రథి
తతామలయశాః అనేక సమరసంక్షోభజనిత జయశబ్దో గాఙ్గా
మలకుల ప్రతిష్ఠః ప్రతాపానిశయానామిత సమస్త సామన్త చూడా

రెండవ రేకు—మొదటి వైపున.

మణి ప్రభామఞ్జరీపుఞ్జరఞ్జిత చరణో మాతాపిత్రు పాదాను ధ్యాతః పరమ
మాహేశ్వరః శ్రీమహారాజో హస్తివర్మ్మా క్రోష్టుకవర్త్తన్యాం హాన్ద్గోలకగ్రామే స
ర్వ్వా సమవేతా న్కుటుమ్బినః స్సమాజ్ఞాపయతి విదితమస్తు వోయథాస్మాభి

అస్మి న్గ్రామే గ్రహారిక సకాశాత్క్రీత్వా ద్వ్యర్ధహాలస్య భూశ్ఛిది కృత్వా చన్ద్రార్క-
ప్రతిష్ఠ మగ్రహారఙ్కృత్వా సర్వకరైః పరిహృత్య మాతాపిత్రో రాత్మనశ్చ పుణ్యాభి వృద్ధయే
ఉరామల్ల నివాసినే వత్సగోత్రాయ వాజసనేయస బ్రహ్మచారిణే జయ

రెండవ రేకు—రెండవ ప్రక్క.

శర్మణే కార్తికకృష్ణాష్టమ్యా ముదకపూర్వ [o] సంప్రత్తా తద్విదిత్వా స్వభూమి వాసిభిః
యత్రాం న కేనచి త్పరివాధా కార్యేతి । సీమాలిఙ్గానిచాత్ర, పూర్వేణ వల్మీక స్తతః
క్షేత్రపాలీ తతో ఘోవణవాప్యాః పశ్చిమపాలీ తతః పునరపి క్షేత్రపాలీ
దక్షిణేన హ్యుత్తరవన్న సీమాన్తికావేవ పశ్చిమేన క్షేత్రపాలీ తతో వల్మీకః
తతః కృత్రిమా పాషాణపఙ్క్తిః । ఉత్తరేణాపి క్షేత్రపాలీ తతో వల్మీకః పునర్వల్మీకః
[త]తో పూర్వ వల్మీకమనుప్రాప్తతి । భవిష్యద్రాజభిశ్చాయ స్థానధర్మోను పాలనీయః

మూడవ రేకు—మొదటి ప్రక్క.

తథాచ వ్యాసగీతాః—బహుభిర్వసుధాదత్తా బహుభిశ్చానుపాలితా యస్యయస్య
యదాభూమి స్తస్యతస్య తదాఫలం-స్వ దత్తాంపరదత్తాంవా యత్నాద్రక్ష యుధిష్ఠిరమహీం [●]
మహీమతాంశ్రేష్ఠ దానా చ్ఛ్రేయోనుపాలనం షష్టింవర్ష సహస్రాణి మోదతేదివి
భూమిదః ఆక్షేప్తా చానుమన్తాచ తాన్యేవ నరకేవసేదితి । ప్రవర్ధమాన విజయ
రాజ్యసంవత్సరా అశీతి OO॰ కార్తికదిన S ॥ ఇదం వినయచన్ద్రేనభాను
చన్ద్రస్యసూనునా శాసనం రాజసింహస్య లిఖితం స్వముఖాజ్ఞయా ॥

మూడవ రేకు—రెండవ ప్రక్క ను.

మణ్డలాగ్రాగ్రనిష్పేష నిష్పిష్టా రాతిసన్హతేః
శ్రీమతో ప్రతిఘాజ్ఞస్య రణాభీతస్య శాసనమ్ ॥

## తెలుఁగున అర్థ వివరణము

శుభము. సర్వర్తు సుఖ రమణీయ మైన విజయ కళింగనగరము నుండి:—సకల భువన నిర్మాణైక సూత్రధారుఁడును భగవానుఁడును నగు గోకర్ణస్వామియొక్క పాదద్వంద్వ ప్రణామము వలన నపగత మగు కలికల్మషము గలవాఁడును, వినయ నయసంపదల కాధారుఁడును, తన ఆసిధారయొక్క సంచలన మాత్రముచేత తనవశముచేసికొనిన సమస్త కళింగ రాజ్యము గలవాఁడును, చతుస్సముద్రిత భూమియంత యందుఁ ప్రసిద్ధి గాంచిన నిర్మల మగు కీర్తిగలవాఁడును, అనేక రణరంగములయందు జయశబ్దము ఆర్జించినవాఁడును గాంగామలకుల ప్రతిష్ఠుఁడును ఎదిరింపని ప్రతాపముచే వినమితు లగు సమస్త సామంతరాజుల చూడామణి ప్రభామంజరీ పుంజములచే రంజితము లగు పాదయుగము గలవాఁడును, మాతా పితృ పాదసేవకుఁడును పరమ మాహేశ్వరుఁడును అగు శ్రీ హస్తివర్మ మహారాజు గారు, క్రోష్టుకవర్తని ప్రదేశమునందున్న హిందోళగ్రామమునందు కూడియున్న కుటుంబుల నందఱను ఇట్లు ఆజ్ఞాపించుచున్నారు:—మీకు తెలియఁ గాక, ఏమనఁగా — మాచేత నిచ్చట అగ్రహారికుల యొద్దనుండి అధ్యర్ధహాల పరిమాణము గల భూమి విక్రయించుకొనఁబడి, విభక్తమై అచంద్రార్క ప్రతిష్ఠముగా నగ్రహారముగా ఏర్పాటు చేసి, ఏ విధమైన పన్నులు లేకుండఁ జేసి, మా తల్లి దండ్రుల యొక్కయు మా యొక్కయు పుణ్యాభివృద్ధికై, ఉరామల్ల నివాసియును వత్సగోత్రుఁడును వాజసనేయ శాఖీయుఁడును అగు జయశర్మకొఱకు కార్తిక కృష్ణాష్టమియందు ఉదకధారాపూర్వకముగ నీయఁబడినది. ఈ విషయమును ఎఱింగి, స్వభూమిని పాలించుకొను ప్రతిగ్రహీతలకు ఎవ్వరును ఏ విధమైన బాధను చేయఁదగదు.

దాన మీయఁబడిన భూమికి హద్దులు ఇవి:—తూర్పున నొకపుట్ట, అటుపైని క్షేత్రపాళి, అటుపైని ఘోషణవాపియొక్క పశ్చిమపాళి, అచ్చటినుండి మరల క్షేత్రపాళి. దక్షిణమునం దుత్తరమునందు వలెనే హద్దులు. పశ్చిమమున క్షేత్రపాళి, అటుపైని వల్మీకము, అటుపైని కృత్రిమ మగు పాషాణపంక్తి. ఉత్తరమునందు క్షేత్రపాళి, అటుపైని వల్మీకము, పిమ్మట మఱియొక వల్మీకము కూడ, తరువాత మొదటి వల్మీకము అనుక్రమముగా వచ్చును. రాజులు ఈ దానధర్మములను అనుమోదించి పాలింపఁదగుదురు. వ్యాస గీతలు కూడ ఇట్లే కలవు.

ఎట్లనగా:—అనేకులు వసుధను దానము చేసిరి. ఇట్లే అనేకులు అనుపాలించిరి. భూమి ఏ యే కాలమున నెవ్వ రెవ్వరి వశమున నుండునో అప్పుడు వారివారికి తత్ఫలము లభ్య మగును. ధర్మజా!—స్వదత్తమును కాని పరదత్తమును కాని భూమిని బాధ నొందకుండ రక్షించుచుండుము. మహానుభావులలో నుత్తముఁడ వగు ధర్మజా! భూమిని దాన మిచ్చుటకంటెను ఇతరు లిచ్చినదానిని అనుమోదించి పాలనము చేయుట యుత్తమము. ఇట్లు చేసిన దాతయును అనుపాలకుఁడును అరువదివేలేండ్లు స్వర్గమునఁ గ్రీడింపఁగలఁడు. ఇందులకు ఆక్షేపించువాఁడును, ఆక్షేపకుని అనుమోదించువాఁడును అరువదివేలేండ్లు నరకమునఁ గూలియుండెదరు. అనుక్రమముగా జరుగుచు వచ్చుచున్న విజయరాజ్య సంవత్సరములు ౮౦ అగు నేటి కార్తిక కృష్ణ ౮ దినమునందు ఈ శాసనము భానుచంద్రనామఁ డగు విజయచంద్రుని చేత రాజసింహుఁ డగు హస్తివర్మయొక్క ఆజ్ఞ ననుసరించి లిఖిత మైనది. కరవాలాగ్రమునఁ బిప్పిబిప్పిగాఁ గొట్టఁబడిన శత్రురాజులు కల వాఁడును, శ్రీమంతుఁడును రణాధిపుఁడును నగు గాంగవంశీయునికి ఈ శాసనము.

---

గడచిన సంవత్సరమున (1919) జూను నెలలో నామిత్రులైన శ్రీయుత లోకనాథుని నాగేశ్వరరావుపంతులుగారు ఉర్లాము రాజా గారివలన లభింపఁబడిన యొక తామ్రశాసనమును పరిశోధనార్థమై నా కొసఁగిరి. ఈశాసనము మూఁడు తామ్రరేకులమీఁద వ్రాయఁబడినది. ఈరేకులు ఒక యుంగరముచేత బంధింపఁబడియున్నవి. రాజదత్తములగు తామ్రశాసనముల కుండు నుంగరములమీఁద రాజముద్రిక యుండుట యాచారము. కాని ఈశాసనపు టుంగరముపై నుండు ముద్రిక యెవ్వరో యెట్లో ఛేదింపఁబడినందున, దీనిపై నిది యిప్పుడు కానఁబడుట లేదు. కాఁబట్టి ముద్రికవలన తెలియఁదగిన విశేషవిషయములను తెలిసికొను నవకాశము నాకుఁ గలుగలేదు. ఈశాసనమునందలి రాగిరేకులలో రెండవదానికి ఒక్క ప్రక్కను మాత్రమే అక్షరములు కలవు. తక్కిన రెంటింటికిని రెండుప్రక్కలను అక్షరములు కలవు. ఇందలిలిపి మిక్కిలి ప్రాచీనమైనది. ఆంధ్రాక్షరములతో వ్రాయఁబడిన యీశాసనము క్రీ॥ శ॥ నాలుగవ శతాబ్దమునాఁటిదై యుండవచ్చును. ఇందలి లిపి మిక్కిలి ప్రాచీనమైన దగుట కెంత మాత్రమును సందేహము లేదు. ఈశాసనము ఇప్పటికించుమించుపదు నాలుగు శతాబ్దులకు ముందు వ్రాయఁబడినను, అక్షరము లెంత మాత్రమును అరిగిపోక, స్ఫుటములై నిన్ననో నేఁడో వ్రాయఁబడినట్లున్నవి. ఈశాసనము ఉర్లాము సంస్థానములో ఏగ్రామమునందు ఎప్పుడు ఏప్రదేశమున ఏ సందర్భమునందు దొరకినదో శ్రీ నాగేశ్వరరావుపంతులు గారు విచారించి ప్రచురింపఁ గర్తలు. ఇది యీఁకతో నిండిన మట్టి కుండయందు భూస్థాపితమై దొరకినట్లు తెలియవచ్చుచున్నది. అందు వలననే ఇందలి యక్షరము లంత స్ఫుటముగా నున్నవి. లేనియెడల నీరేకులు చిలుముపట్టి మట్టిచే తినఁబడి యెప్పుడో జీర్ణదశకు వచ్చి యుండును. ఈశాసనము త్రికళింగ మను నాంధ్రరాజ్యము మహోచ్ఛదశయం దున్న ప్రాచీనకాలమున నాదేశపు చక్రవర్తులలో నొక్క డగు హస్తివర్మ మహారాజుచే వ్రాయింపఁబడినది. ఈతఁడు గాంగ వంశజుఁడు. ఈశాసనముయొక్క పాఠమును ఆ ప్రతిబింబములకు ఎదుర నున్న పేజియందు ఇచ్చితిమి.

మన మిప్పు డీ శాసనమునకు కాలనిర్ణయము చేయవలసి యున్నది. మహారాజైన హస్తివర్మ ప్రవర్ధమాన విజయరాజ్య సంవత్సరములు 80 అగు కార్తిక కృష్ణాష్టమినాఁ డీదానము చేసినట్లు మాత్రమే మన కీ శాసనము తెలుపుచున్నది. కాని, యీహస్తివర్మ తండ్రితాత లెవ్వరో, ఈ అశీతి (80) సంఖ్యను శాలివాహనశకము నకు గాని, హూణశకమునకుగాని మార్చుట యెట్లో—మున్నగు విషయములు మనకుఁ దెలియరావు. సముద్రగుప్తునితో యుద్ధముచేసి యోడిపోయిన హస్తివర్మయొక్కఁడు కలఁడు గాని, యాతఁడు వేంగి దేశాధిపుఁ డైనట్లు గయాక్షేత్రమునందలి స్తంభముపై వ్రాయఁబడిన శాసనమువలనఁ దెలియవచ్చుచున్నది. కళింగనగరాధిపుఁడైన మన శాసనములోని హస్తివర్మయు ఆ హస్తివర్మయు నొక్కరేయనుటకు వలసినంత యాధారము దొరకుటలేదు, ఆహస్తివర్మను మన శాసనములోని హస్తివర్మనుగా నూహింప వీలులేకున్నది. అందువలన నీ శాసనకాలమును మనము వేఱుసాధనములవలన నిర్ణయింపవలసి వచ్చుచున్నది. "గాంగామలకులతిలకో" అను శాసనములోని సమాసము వలన నీహస్తివర్మ గంగవంశపు రాజైనను, కళింగదేశపు చరిత్ర మింకను స్పష్టముగా వ్రాయఁబడకపోవుటచేతను, పాశ్చాత్యపరిశోధకులు వ్రాసిన కొన్ని విషయములు అన్యోన్యవిరుద్ధములై యుండుట చేతను, గంగరాజుల చరిత్రమును నేను శాసనప్రమాణానుసారముగా నిచ్చోట ముందు నిర్ణయించి, అవెనుక నే హస్తివర్మకాల నిర్ణయము చేయవలసియున్నది.

శాసనములవలనఁ దెలియఁబడిన సంగతుల ననుసరించి, త్రికళింగ రాజులను రెండుశాఖలవారినిగా మనము విభజింపవలసి యున్నది. అందు రెండవశాఖవారిలో నొకఁడైన కామార్ణవుఁడను రాజు తత్పూర్వపు కళింగవంశపు రాజులను జయించినట్లు అనంతవర్మ చోడగంగదేవుని సింధురాపురపు శాసనమువలనఁ దెలియవచ్చుచున్నది. ఈరెండవశాఖవారి వంశవృక్షము కొన్ని శాసనముల ననుసరించి యీక్రింద వివరింపఁబడినది. ఒక్కొక్క రాజుయొక్కయు రాజ్యపరిపాలన కాలముకూడ దీనివలనఁ దెలియఁదగును. ఈశాసనమును ఇతర శాసనములతోఁగూడఁ బోల్చిచూచి, సరియైన కళింగరాజుల పట్టికను ఈవ్యాసాంతమునందుఁ జేర్చుచున్నాను.


మహావిష్ణువు
చంద్రుఁడు
గాంగేయుఁడు
కోలాహలుఁడు
(గంగవాడిలో కోలాహలపురాధిపుఁడు)
విరోచనుఁడు
81 మంది రాజులు
వంశ పారంపర్యముగా
వీరసింహుఁడు
కామార్ణవుఁడు I
ఇతఁడు బాలాదిత్యుని జయించి కళింగరాజై 36 ఏండ్లు రాజ్యపాలనము చేసెను (1)
దానార్ణవుఁడు
40 సంవత్సరములు (2)
గుణార్ణవుఁడు I
మారసింహుఁడు
వజ్రహస్తుఁడు
కామార్ణవుఁడు II
నగరము రాజధానిగా 50 సం॥ రాజ్యమేలెను (3)
రణార్ణవుఁడు 5 సం॥ (4)
వజ్రహస్తుఁడు II 15 సం॥ (5)
కామార్ణవుఁడు III 19 సం॥ (6)
గుణార్ణవుఁడు II 27 సం॥ (7)
గుండమరాజు
3 సం॥ (10)
పేరు తెలియదు
కళింగాంకుశుఁడు
12 సం॥ (9)
జితాంకుశుఁడు
15 సం॥ (8)
కామార్ణవుఁడు IV
35 సం॥ (11)
వినయాదిత్యుఁడు
3 సం॥ (12)
వజ్రహస్త అనియంకభీముఁడు
35 సం॥ (13)
రెండవ భార్య
కామార్ణవుఁడు
½ సం॥ (14)
గుండమరాజు
3 సం॥ (15)
మధుకామార్ణవుఁడు
19 సం॥ (16)
వజ్రహస్తుఁడు 33 సం॥ (17)
రాజరాజు 8 సం॥ (18)
అనంతవర్మ చోడగంగదేవుఁడు.

నేను తెలిపిన ఈ మొదటి వంశావళికి ఆధారము లెవ్వి యని యెవ్వరైనను ప్రశ్నింపవచ్చును. "వియదుదధిఖేందు గణితేషు శకవత్సరేషు పుణ్యేహని" అనఁగా శక సంవత్సరములు 1040 యగు నప్పుడు వ్రాయఁబడిన, త్రికళింగాధిపుఁ డగు అనంతవర్మ చోడగంగదేవుని సింధూరపురి తామ్రశాసనములో నితని వంశావళి తెలుపఁబడినది. ఈశాసనమును ఇప్పుడు చెన్నపురిలోని చిత్రవస్తుప్రదర్శనశాలయందు చూడవచ్చును. ఇదిగాక శక సంవత్సరములు "అజగిరినిధి" అనఁగా 979 సంవత్సరపు ఫాల్గుణ శుక్ల ద్వాదశి ఆదివారమునాఁడు త్రికళింగాధిపుఁ డగు వజ్రహస్తదేవునిచే నొసఁగఁబడిన నదగాము తామ్రశాసనములవలనఁ గూడ నీవంశములోని గుండమరాజు (10 యవ రాజు) వంశావళి (పదునేడవ రాజగు) వజ్రహస్తునివఱకును దెలుపఁబడినది. ఇందలి లెక్కలనుబట్టి యీవంశపురాజులు పదొమ్మండ్రునుచేరి 482½ సంవత్సరములు ఏలిన ట్లగుచున్నది.

పైని చెప్పినది రెండవ వంశమునకు సంబంధించిన త్రికళింగ రాజులవిషయము. మొదటివంశమునకు చేరిన కళింగరాజుల చరిత్రమునకు ఇంకను ఆధారము లంతగా దొరకలేదు. పశ్చిమ చాళుక్యచక్రవర్తి యగు మంగళేశరణవిక్రాంతుఁడు వంగాంగ కళింగ వట్టూర మగధ మద్రక కేరళ గాంగ మూషక పాండ్య ద్రమిళ చోళీయ అళువ వైజయంతీ పురాధీశులను జయించినట్లు బాదామిశాసనమువలనను, సత్యాశ్రయపులకేశి కళింగరాజుతో యుద్ధముచేసినట్లు ఐహోలు శాసనమువలనను, దెలియుచున్నందున ఈశాసనముల కాలమునాఁటి కళింగరాజ్యచరిత్రము విశదమగుచున్నది. వారిలోని మొదటిరాజగు కామార్ణవుఁడు బాలాదిత్యుని జయించి కళింగాధిపుఁ డైనట్లు అనంతవర్మశాసనమువలనఁ దెలియఁబడుటచే, ఈబాలాదిత్యుఁ డెవ్వఁడో మనకుఁ దెలియవలసియున్నది. (1) శక సంవత్సరములు 620 ప్రాంతములందు బాలాదిత్యుని కుమారుఁడైన ప్రకటాదిత్యుఁడను రాజొకఁడుండినట్లు కలకత్తా చిత్రవస్తుశాలలో నున్న సారానాథశాసనమువలనఁ దెలియుచున్నది, ఈశాసనము శిథిలమై యున్నందున ఈబాలాదిత్యుఁడే కళింగాధిపుఁడని నిర్ణయించుట సులభము కాదు. (2) మగధరాజ్యము నేలిన గుప్తవంశములో నొక బాలాదిత్యుఁడు కలఁడు. అతనినిఁగూర్చియు మనకంతగా తెలియదు. (3) గుప్తశకము 310 ప్రాంతములలో ధ్రువసేన బాలాదిత్యుఁ డొకఁ డుండినట్లు వల్లభిశాసనమువలనఁ దెలియవచ్చుచున్నది. ఈ శాసనమువలన భటార్కుఁడను రాజునకు ధారసేనుఁడను కుమారుఁ డుండినట్లును, అతనికి శిలాదిత్యుఁడును, అతనికి ఖరగ్రాహుఁడును, ఆఖరగ్రాహునికి ధారసేన బాలాదిత్యులను నిరువురు కుమారులును గలిగినట్లు తెలియవచ్చుచున్నది.

మనకుఁ గావలసిన యీబాలాదిత్యుఁ డెవ్వఁడో తెలిసికొనుటకు ఆధారములు లేవు. కాని ఈతని పూర్వమునందు త్రికళింగము నేలిన రాజుల శాసనము లనేకములు మనకుఁ గానవచ్చుచున్నవి. అందు సత్యవర్మ యనురాజు కళింగనగరమునుండి తాల్యపగ్రామము యామున "గాంగేయవంశ సంవత్సర శతత్రయైక పంచాశతి" నొసగిన శాసనమువలన బాలాదిత్యునికిఁ బూర్వమందు గాంగశక మొకటి యుండెననియు నాశకసంవత్సరములు 351 లో సత్యవర్మ యుండెననియు తెలియుచున్నది. సత్యవర్మకును బాలాదిత్యునికిని నడుమ నెందఱు రాజు లుండిరో తెలియవచ్చుటలేదు. ఈయిరువురికిని నడుమ రమారమి ఏఁబదేండ్లవ్యవధి యుండినను నుండవచ్చును.

హ్యూన్‌త్సాంగు అను చీనాదేశపు యాత్రికుఁడు తనకాలమునందు కళింగరాజ్యమునకు రాజమహేంద్రవరము ముఖ్యపట్టణ మని వ్రాయుచున్నాఁడు. వేంగిరాజ్యమును జయించిన రెండవ సత్యాశ్రయ పులకేశి కళింగరాజ్యముతో యుద్ధముఁ జేసినట్లు ఐహోలుశాసనమువలనఁ దెలియఁబడిన దని ఇదివఱకే నేను చెప్పియున్నాను. పులకేశియొక్క ఈశాసనము శకసంవత్సరముల 556 నాఁటిది. మంగళేశుఁడు కళింగరాజును జయించిన విషయముగూడ ఇదివఱకే చెప్పఁబడినది. ఈబాలాదిత్యుఁడు పశ్చిమ చాళుక్య చక్రవర్తులకు సంబంధించిన మనుష్యుఁడు కావచ్చును. ఏదియెట్లున్నను శకవర్షములు 351 లో సత్యవర్మ శాసనము తరువాత మనకు మొదటివంశపు గాంగుల శాసనములు కానవచ్చుటయే లేదు. ఈకాలమునందు దేశము చాళుక్యులకు స్వాధీనమై యుండినను నుండవచ్చును. సత్యవర్మ తరువాత మనకుఁ దెలిసిన రాజు బాలాదిత్యుఁడే. వీరినడుమ ఒక నూఱు లేక ఏఁబది సంవత్సరములవ్యవధి యుండవచ్చును. సత్యవర్మ తరువాతిరాజే బాలాదిత్యుఁడని తలంచుటకు ఆధారము లెవ్వియు లేవు. పేరునుబట్టి యీ బాలాదిత్యుఁడు చాళుక్యవంశపు రాజుగా కానవచ్చుచున్నాఁడు. ఇదిగాక సత్యవర్మయొక్క యొక శాసనము గాంగేయ సంవత్సరములు 351 లో కానవచ్చుటచే ఆసంవత్సరమునందే సత్యవర్మ చనిపోయెనని గాని, బాలాదిత్యుఁడు 591 లో రాజ్యభ్రష్టుఁ డైనందున అతడు ఆ ఏటనే రాజ్యమునకుఁగూడ వచ్చెనని గాని చెప్పుట సమంజసము కాదు. ఎట్లుచూచినను సత్యవర్మకును బాలాదిత్యునికిని నడుమ అనఁగా గాంగశకవర్షములు 351 కిని శాలివాహనశకవర్షములు 591 కును మధ్య-అధమము ముప్పది నలువది సంవత్సరముల వ్యవధి యైన నుండవచ్చును. లేనియెడల ప్రకృతము విమర్శింపఁబడుచున్న శాసనములోని మిక్కిలి ప్రాచీనములైన యక్షరముల తత్త్వమునకు సరియైన సమాధానము రాదు. గాంగేయశకసంవత్సరము 284 లో అనంతవర్మయను మహారాజుండినట్లు 'ఇండియన్ ఆంటిక్వేరీ' పత్రిక 13 వ సంపుటములోని 164 పుటవలనఁ దెలియుచున్నది. గాంగేయ శకవర్షములు 183 లో గుణార్ణవుని కుమారుఁడగు దేవేంద్రవర్మచే నొక దానశాసన మీయఁబడినట్లు 'ఎపిగ్రాఫియా ఇండికా' యను పత్రికయొక్క మూడవ సంపుటము 131 వ పుటలో వ్రాయఁబడియున్నది. ఇంద్రవర్మ యను రాజు రెండుశాసనము లొసఁగినట్లు "ఇండియన్ ఆంటిక్వేరీ పత్రిక" 13 వ సంపుటములోని 120, 124 పుటలవలనఁ దెలియుచున్నది. ఇందు మొదటి శాసనము గాంగేయశకము 146 వ సంవత్సరమునను రెండవది 128 వ సంవత్సరమునను వ్రాయఁబడినది. గాంగేయశకము 91 వ సంవత్సరములో గంగమహారాజగు ఇంద్రవర్మరాజసింహుని శాసన మొక్కటి

ఈశాసనమునందలి లిపి యత్యంత ప్రాచీనమగుటచేతను ఇదివరకు మనకు తెలియఁబడిన ప్రాచీన పూర్వచాళుక్య శాసనములలోని లిపికంటెను గూడ నిందలి లిపి యెక్కువ ప్రాచీనముగఁ గానవచ్చుటచేతను బాలాదిత్యుఁడు కామార్ణవునిచే జయింపబడిన 591 వ సంవత్సరమునకును సత్యవర్మయొక్క గాంగశకవర్షములకు 651 కిని నడుమ 60 సంవత్సరముల వ్యవధియుండునటుల తలంచుట అసంభవము కాదు. అప్పుడు హస్తివర్మశాసనము 86—27=250 లేక హూణశకవత్సరములు 270 x 78=348 అగును. ఇదియే సముద్రగుప్తునిచే వెంగిరాజు ఓడింపబడినట్లు తెలుపుచున్న గయాక్షేత్రములోని ప్రసిద్ధశాసనముయొక్క కాలము ఎట్లు నూహించినను ఈహస్తివర్మయే సముద్రగుప్తునిచేత ఓడింపఁబడిన హస్తివర్మగ గానవచ్చుచున్నాఁడు. అట్లు కాకపోయినను ఈతఁడు శకవత్సరములు 270 లేక హూణవత్సరములు 348 కాలమువాఁడను టకు సందేహమేలేదు. అప్పుడు సత్యవర్మ రాజ్యమునకు వచ్చుటయు రాజ్యమును పోగొట్టుకొనుటయు బాలాదిత్యుఁడు రాజ్యమునకు వచ్చుట యీ బాలాదిత్యుఁడు రాజ్యభ్రష్టుఁడగుటయు రెండవ వంశపు గాంగులు కళింగాధిపులగుటయును వీని కన్నిటికిని 50 సంవత్సరములు వ్యవధియుండును. కాబట్టి ఈ హస్తివర్మయే సముద్రగుప్తుని కాలమునాఁటి హస్తివర్మగ మనము ఊహించుకొనవలయును.

పాశ్చాత్యపరిశోధకులు గాంగశకవర్షములను హూణశకవర్షములకుగా మార్చు పద్ధతిని ఇంకను కనిపెట్టలేదు. ఈశాసనమువలన మనము ఇంచుమించుగ దీనిని తెలిసికొనవచ్చును.

సముద్రగుప్తుఁడు క్రీస్తుశకము 326 మొదలుకొని 375 వరకు పరిపాలించినట్లు చరిత్రమువలన తెలియుచున్నది. ఈతఁడు 330 క్రీ॥శ॥ సంవత్సరములో సింహళద్వీపరాజగు మేఘవర్మచేత బహుకానుకల నందినవాఁడు. ఈతఁడు 11 రాజ్యములను జయించినందున్ను, అందు వేంగిరాజ్యము గూడ నుండెనందునను, ఇతర రాజ్యములు జయించిన వెనుకనే ఈతఁడు దక్షిణరాజ్యములకు వచ్చెనందునను వేంగిరాజ్యము నితఁడు జయించిన నాఁటికాలము ఇంచుమించుగ క్రీస్తుశక వర్షములు 357 అయియుండును. అదియే హస్తివర్మకాల మగుటచేతను ఈహస్తివర్మ తరువాత చేయు సంవత్సరముల నాటికి ఇంద్రవర్మ కళింగరాజై యుండుటచేతను గాంగశకవర్షములు 80 ని క్రీ॥శ॥ వర్షములు 350 గ మనము కొంతవరకు పరిగణించుకొనవచ్చును. కాబట్టి 350—80 క్రీస్తుశకము 270 లో లేక గాంగశకము ఆరంభమైనట్లు ఊహింపవచ్చును. దీనివలన గాంగశక వర్షములకు 270 కలిపిన యెడల క్రీస్తుశక వర్షములు వచ్చునని తేలుచున్నది. కాని ఇంచుమించుగ కొంతవరకుమాత్రమే దీనివలన సంవత్సరపరిమితి తేలగలదు. ఈహస్తివర్మయు ఈతనివంశపువారును శైవులు. "పరమమాహేశ్వర" అనుపదము ఈవంశపు రాజులకు సామాన్యమైయున్నది. వీరు అఖండశివపూజాధురంధరులై శైవమతము ప్రతిష్ఠించినటుల దీనివలన నిశ్చయింపవచ్చును.